Jaggannaśāstri, Mudigaṇṭi

Mējinī Jīvitamu

Kākināḍa, 1929

Record no. 941

జగ్గన్నశాస్త్రి, ముదిగంటి.
మేజినీ జీవితము / గ్రంథకర్త ముదిగంటి జగ్గన్నశాస్త్రి.- 1. కూర్పు.- కాకినాడ : కాకినాడ ముద్రాక్షరశాల, 1929.
2, 118, 3 p. ;18 cm.
Record no. 941

Jaggannaśāstri, Mudigaṇṭi.
Mējinī Jīvitamu / granthakarta Mudigaṇṭi Jaggannaśāstri.- 1. kūrpu.- Kākināḍa : Kākināḍa Mudrākṣaraśāla, 1929.
2, 118, 3 p. ;18 cm.
Record no. 941

## The Life of Vinayaka Savarkar by

# Mudiganti Jagganna Sastry,

## RAJAHMUNDRY.



If you wanted a book to kindle your sympathies and to occupy your time for not more than 60 minutes and in that short space to fill you with pathos and patriotic fervour, then you buy a copy of Vinayaka Savarkar's biography for a rupee and get the full return for your money. The story of his revolutionary activities, his zeal for the emancipation of his motherland, his arrest, his adventures in the French waters, his dip into the ocean, his race for life, his appeal to the French Police, his arrest by the Jubhurdhust of the British pursuer in Marseilles, his trial in India and sentence, his experiences in the Andamans, make, such pathetic, albeit, rapturous reading that we have no words with which to congratulate the author upon the choice language in which he has clothed the story and the racy style, which adds pique to the language.

Janmabhumi 3rd May 1928.

Reduced price As. **0-12-0.**

"పల్లెటూరుగ్రంథమండలి" పదిహేనవ పుస్తకము.

సంపాదకుడు ముదిగంటి జగ్గన్నశాస్త్రి

# మేజినీ జీవితము.



గ్రంథకర్త:

ముదిగంటి జగ్గన్నశాస్త్రి.

రాజమండ్రి.

మొదటికూర్పు 1000

కాకినాడ:

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1929





[వెల 0—10—0.

# అంకితము.

దేశభక్తి, మానవభక్తి, దైవభక్తియను భక్తిత్రయము నారాధించుచు పరప్రభుత్వదాస్య శృంఖలా విచ్ఛేదముకొరకు దార్వంతస్థితాగ్నిహోత్రము వలె తహతహలాడుచు మాతృదేశ పాదారవిందములకడ నసువుల నర్పించి, యురికంబముల కెగబ్రాకి ఖయిదులలో మగ్గి, దేశాంతర, ద్వీపాంతరవాసముల ననుభవించి ఋణత్రయమును దీర్చుకొనిన యువకుల కీగ్రంథము నంకిత మొనర్చుచున్నాను.

గ్రంథకర్త.

# ఉపోద్ఘాతము.

పందొమ్మిదవ శతాబ్దములో ప్రపంచ రాజకీయములలో ముఖ్యపాత్రవహించినవారిలో మేజినీ ప్రధానుడనుటలో నతిశయోక్తియేమియు లేదు. ఇతడు యిటలీలో జనించి తన మాతృఋణమును దీర్చుకొనుటకు చేసిన సేవ, త్యాగము అపారము. ప్రస్తుతము భారతదేశ మెట్టిదుస్థితిలో నున్నదో యిటలీ యప్పు డట్టి స్థితిలో నేయుండెను. దేశమంతయు ననేక రాజులచే పీడింపబడుచు చీలికలైయుండుట యొకవంక; ఆస్ట్రియా, ఫ్రాన్సు మొదలగు పరప్రభుత్వదాస్య మొకవంక; వివిధములైన పన్నులభార మొకవంక; వాక్స్వాతంత్ర్యము, పత్రికాస్వాతంత్ర్యము, వర్తకస్వాతంత్ర్యము మొదలగు నన్ని స్వాతంత్ర్యములు నిరోధింపబడు టొకవంక; ప్రజలుక్షుత్తామబాధితులగుచు నిర్వీర్యులై, జాతీయతయన నెరుగక వివిధపక్షములతో తమలో తామే కలహించుకొను టొకవంక; స్వధర్మము; ఆత్మజ్ఞానము, దైవభక్తి, దేశభక్తి, మానవలోకాభ్యుదయము అనునవి ప్రజలలో శూన్యమగుట—భారతదేశములో ప్రస్తుతమున్న పరిస్థితులుకూడ నివియే—ఇట్టి పరిస్థితులలో మేజినీ యిటలీలో నుదయించి యోధులలో యా

ధుడై, రాజకీయవేత్తలలో రాజకీయవేత్తయై, వీరులలో వీరుడై, ఆదర్శపురుషులలో నాదర్శపురుషుడై, జ్ఞానులలో జ్ఞానియై, తత్త్వవేత్తలలో తత్త్వవేత్తయై దేశములో నొకనూతన సంస్కారమును, నూతనజ్యోతిని, నూతనవీర్యమును, నూతన జాతీయశక్తిని సృష్టించెను. మట్టిముద్దలకు ప్రాణప్రతిష్ఠ జేసి పోరాడించెను. 'భగవంతుడు ప్రజలు' నూతన తారకమంత్రము నుపదేశించెను. ఈరెంటిని సేవించుటే మానవధర్మమని చాటెను. ధర్మముకొరకు జీవింపజాలని జీవి చచ్చినను జీవించియున్నను నొక్కటేయని తెలియజేసెను.

ఇట్టి మహాత్ములే దేశమునకు చెందినవారైనను పూజ్యులు. వారిజీవితములు మానవలోకమంతకును దీపికలవంటివి. ఇట్టి తేజస్సుల నారాధించి తమ జీవితములను సంస్కరించుకొని భారతీయులు జాతీయసేవకు, మానవసేవకు, భగవత్సేవకు గడంగుదురుగాక!

ముదిగంటి జగ్గన్నశాస్త్రి.

---

# మేజినీ జీవితము.



## బాల్యము.

'ఇటలీదేశపుమహాత్ముడును' నిరంకుశపరిపాలకుల ప్రక్కబల్లెమును, పందొమ్మిదవశతాబ్దములో యూరపునంత నుఱ్ఱూతలూగించిన విప్లవానేక కదనరంగముల కధినాయకుడును, మహావేదాంతియు నగు జోసెఫ్ మేజిని యగ్నిపర్వతముల కాకరమగు నిటలీదేశమున 'భారతస్వాతంత్ర్యయుద్ధము' జరుగుటకు సుమారొక్క యర్ధశతాబ్దముపూర్వము 1805 వ వత్సరము జూను 22 వ తేదిని జినీవాలో 'వయా లోమిలీనా' యనుచోట జన్మమొందెను. అతనితండ్రి గొప్పవైద్యుడు; విశ్వవిద్యాలయములో జీవశాస్త్రపండితుడు; సిద్ధాంతములందును, నాచరణలందును ప్రజాస్వామిక ప్రభుత్వవాది. అతడు తనకాలములో చాలవరకు రాగిపైసయైనను తీసికొనకుండ దరిద్రులకును, నసహాయులకును సేవచేయుటయం దానందించుచుండెడివాడు. మేజినితల్లి మనోబల, బుద్ధిబలములచే నొప్పుచు, భక్తితత్పరురాలై సామాన్యతల్లులకుండునట్టి మమకారాదులకు చోటివ్వక ముందు రాబోవు యుద్ధరంగములను నిర్భయముగా నెదుర్కొనగల శక్తిసామర్థ్యములనే తనపిల్లల కుగ్గుపాలుగా బోయుచుండెను. యూరపులో బయలుదేరుచుండిన మహోద్యమముల నామె పరీక్షించుచు ప్రభు

త్వపద్ధతులలో నున్న లోపములను నిర్భయముగా విమర్శించుచు గృహాంగణములోనుండియే రాజ్యాంగతంత్రములందు బాల్గొనుచుండెను. ముగ్గురు సోదరీమణులమధ్య తల్లిదండ్రులచేతులలో మేజినీ యల్లారుగా పెరుగుచు బాల్యమునుండియే తనప్రతిభావిశేషములను బ్రదర్శింప నారంభించెను. ఒకనాడు తల్లి యారువత్సరముల చిరుతప్రాయపుమేజినిని విహారార్థ మూరుబయటకు గొంపోవుచుండ నస్థిపంజరమోయనునట్లున్న యొకవృద్ధభిక్షుకు నతడు గాంచెను. అత డాజీర్ణస్వరూపము నొకనిమేషము పరికించి వెంటనే తల్లిచేతులనుండి విదల్చుకొని భిక్షుకునివంక పరుగెత్తుకొని పోయి యతనిని గట్టిగా కౌగిలించికొని ముద్దుపెట్టుకొనుచు "తల్లీ! ఇతని కేదేని యొసగుము; ఈముదుసలి యాకలిదీర్పుము" అని యేడ్చెనట! ఆముదుసలి ప్రేమాంబుపూరితలోచనుడై "ఓజననీ! ఈబిడ్డను నిండు హృదయముతో ప్రేమింపుము! ఇతడు ప్రజలను ప్రేమించు మహాయోధుడు కాగలడు" అని జోస్యము చెప్పి బిడ్డ నాశీర్వదించెను. వారిగృహ మెప్పుడును కలకలలాడుచు దోసపాదువలె చూపరుల కానందమును గలుగజేయుచుండెను. మేజినీ చిన్ననాటినుండియే విద్యాగోష్ఠి నలుప నారంభించెను. చిన్ననాటనుండియే ప్రపంచవిషయములను బరికింప నారంభించెను. 1814 లో నెపోలియనుచక్రవర్తి యోడింపబడి యెల్బాకు ఖైదీగా గొంపోబడెను. తొమ్మిది



యేండ్లయలబ్రాయముననున్న మేజినీ నెపోలియను యిటలీలో జన్మించెననియు, నిటలీలో నొకద్వీపములో బంధింపబడుచున్నాడనియు, నాటినుండి జినీవా స్వాతంత్ర్యలక్ష్మిని గోల్పోయి పరప్రభుత్వదాస్యము ననుభవింపవలసియున్నదనియు, ప్రజాస్వామికప్రభుత్వములకు స్వస్తిచెప్పబడుచున్నదనియు మొదలగు విషయములను తండ్రిద్వారా తెలిసికొని చింతాకలుషితమనస్కుడై యేమేమో యోజించుకొనుచుండెను.

తన తల్లిదండ్రు లెట్టిభేదభావమును లేకుండ నన్నితరగతులవారిని సమానముగా నాదరించుచుంటయు, గృహములో ఫ్రాన్సులో జరిగిన ప్రజాస్వామికయుద్ధములను గురించి చర్చించుకొనుచుండుటయు, పోలీసువారిభయముచే తనతండ్రి యతిభద్రముగా వైద్యగ్రంథములవెనుక దాచిన గిరాండిస్టుపత్రికలును, గ్రీసు, రోముదేశపుచరిత్రలును చిన్ననాటినుండియే తనకు ప్రజాస్వామికాభిమానమును గలుగజేసినని మేజినీ చెప్పుచుండెడివాడు. ఇట్టిబాలుడు బాల్యమునుండియే విద్యావినయములందే గాక మహోద్యమములయందు గూడ శ్రద్ధవహించుచుండ నతని పదునాఱవయేట నొకవిశేషము సంభవించెను. ఇటలీలో స్వాతంత్ర్యసంపాదనకొఱకు "కార్బనరి" యనురహస్యసంఘములు పనిచేయుచుండెను. పదునెనిమిదివందలయిరువది, యిరువదియొకటి

సంవత్సరములలో వీరహాస్య విప్లవకారు లోడింపబడి జెనీవా, సాంవర్డెరీనా మొదలగు ప్రదేశములకు దలదాచుకొనుటకు చెల్లాచెదరై పోవుచుండిరి. వారివద్ద నొక్కపైసయైనను లేకుండెను. ప్రజలు వీధులలో గుమిగూడి చందాలను పోగుచేసి వారి కిచ్చుచుండ మేజినీ వారిచింతాక్రాంతవదనములను పరీక్షించి చూచుచు బాలుఁడయ్యుండు వీరపూజాభిరుచితో వారి ననుగమింప నుత్సహించుచు తనపాఠములకు స్వస్తిచెప్పి యత్యంతయోజనాపరుడై విప్లవనాయకులయొక్కయు విదేశములకు తరుమఁగొట్టబడినవారియొక్కయు వార్తలను, చరిత్రలను జుర్రికొనుచు "ప్రతివాడును స్వధర్మమును నిర్వహించియుండినచో వీఁకి జయము చేకూరియే యుండెడిది." అని వగచుచుండెడివాడు. ఆనాటిభావము లతనిహృదయమున నాటుకొని పోయెను.

తనదేశమోక్షమును సంపాదించుటకు తగినయుపాయముల నారయుట యసంభవమా యనున ట్లతనిహృదయము తల్లడిల్లజొచ్చెను. "నాతోడి విద్యార్థు లందఱును నిర్విచారముగా కోలాహలమనస్కులై దినములను గడుపుచుండ నేను చింతానిమగ్నుడనై వారిమధ్య హఠాన్మృతినొందినవానివలె నుండెడివాడను. నేను నాదేశముకొఱకు సంతతవిచారగ్రస్తుడనై దానిని సూచించుటకొఱ కెల్లపుడును కాలాంబరములనే ధరింప నిశ్చయించుకొంటిని." అని యతడొకసారి తన



బాల్యచరిత్రమును గుఱించి చెప్పెను. జీవితాంతమువఱకు నత డీదీక్షనే పాలించెను. అతడు పదునాల్గవయేట మెట్రిక్యులేషను పరీక్షలో నుత్తీర్ణుడై విశ్వవిద్యాలయములో న్యాయశాస్త్రము జదువుటకు బ్రవేశించెను. కాని న్యాయములకెల్ల మూలతత్వమును గ్రహింప దహించుచున్న యతనిఆత్మనిర్జీవమై, సారరహితమైన విశ్వవిద్యాలయపుచదువులతో తృప్తి పొంద దాయెను. అతడు చాలకాలము కావ్యములను, చరిత్రలను చదువుటయందే గడుపుచుండెడివాడు. అతడు కళాశాలలకు సరిగా వెళ్ళువాడుకాడు. కాని వెళ్ళునపుడెల్ల తన విప్లవతత్వమును కళాశాలలోనే ప్రారంభించుచుండెడివాడు. కళాశాలలో విద్యార్థు లందఱును మతమును బోధించుట కేర్పడిన గంటలో తప్పక హాజరుకావలె నను విధికలదు. అతడు చివరవఱకు నాగంటలో హాజరగుటకు నిరాకరించెను. దానినొక విధిగా నియమించుటచేతనే యత డట్లు చేసెను. స్వేచ్ఛయే గాని నిర్బంధ మనుమాట యతనిచెవిని బడరాదు. ఆవిప్లవదినములలో విద్యార్థుల నెట్టైనను రాజకీయరంగములో పాల్గొనకుండ చేయవలెనని సంకల్పసిద్ధులైనయువకులు లేచి యెప్పుడు ప్రభుత్వమును కూలద్రోయుదురో యను భయముచే ప్రభుత్వమువారు అనేకనిర్బంధవిధానములను పాఠశాలలలో ప్రవేశపెట్టి విద్యార్థుల యుత్సాహ, కార్యశక్తుల నణగద్రొక్క ప్రయత్నించుచుండెడివారు.

మేజినీ మొదటినుండియు వీటి నన్నిటిని ధిక్కరించుచుండెడివాడు. విద్యార్థులకు జీవితముపై రోతపుట్టునట్లు చేయవలెనని ప్రభుత్వమువారు పాఠశాలాధికారులను హెచ్చరించుచుండెడివారు. సదయహృదయుడైన పండితుడు విద్యార్థుల నేమాత్రము సుహృద్భావముతో జూచినట్లు ప్రభుత్వమువారికి దెలిసినను నాటితో నతని యుద్యోగమునకు తర్పణము లొదలవలసినదే! మీసములు పెంచుట విప్లవతత్త్వమని ప్రభుత్వమువారు పరిగణించుచుండెడివారు. విద్యార్థులలో నెవడైనను మీసములు పెంచెనా వెంటనే యతనిని బలవంతముగా కట్టి తీసికొనిపోయి క్షౌరశాలలో మీసములు గొరిగించెడివారు. మేజినీహృదయ మీనిరంకుశచర్యలను గాంచి తప్తమగుచుండెను. అతడీనిరంకుశత్వమును భగ్న మొనర్ప దీక్షబూనెను. వెంటనే విద్యార్థులలో నతడు నాయకుడయ్యెను. అతనిని జూచుటతోడనే విద్యార్థులలో నొకవిధమైన నూతనోత్సాహము, నూతనోత్తేజము రగులుచుండెడివి. సువిశాలమై ప్రకటమైన నెన్నుదురు, కార్యదీక్షను తీవ్రదృష్టిని ప్రకటించు నాకర్ణాంతనయనములు; తుమ్మెదరెక్కలను బోలిన చక్కనిచిక్కనిజుట్టు; మనోహరమైన రూపలావణ్యములు; గంభీరచింతానిమగ్నమైన వదనకమలము; పుష్పకోమలమై సమయము వచ్చినపుడు వజ్రకాఠిన్యమును వహింపగల హృదయము; మందస్మితకాంతులతో దనరారు ముఖవి



లాసములను చూచి ప్రతివాడును నివ్వెరపడుచు నితడద్దియో మహత్తరకార్యమును నిర్వహింప నవతరించినమూర్తి యని భావించుచుండెడివాడు.

అతడెప్పుడును గ్రంథపఠనమును జేయుచు, నిరంతర భావప్రపంచమున దేలియాడుచు శరీరపరిశ్రమయందును, కుస్తీముష్టియుద్ధము మొదలగువాటియందును, నారితేరుచు భోగభాగ్యములందు మనస్సును చొరనీయక నొక్కనిమిషమైనను వృధపుచ్చక ముందు రాబోవుమహాయుద్ధమునకు పునాదులను వేయుచుండెను. అతడు మహావక్త కాగలడను సూచన లప్పుడే కాన్పింపనారంభించెను. అతని యుదారహృదయమునకు మేరలేకయుండెను. తోడిబీదవిద్యార్థులకు లేదనకుండ తనవద్దనున్న పుస్తకములను, ధనమును, వస్త్రములను నతడు యథేచ్ఛగా పంచిపెట్టుచుండెడివాడు. ఈయన్నింటిని మించిన యతని సౌశీల్యప్రభావముచే విద్యార్థులందఱు నతనికి జోహారు లొనర్చుచుండెడివారు. అతనిపవిత్రభావములకు వెరచి తోడివిద్యార్థు లొక్కపరుషవాక్యమును గాని, దుష్ప్రలాపములను గాని యతని సమక్షమందు రానిచ్చువారుగారు. అతనికున్న న్యాయతృష్ణ నిరుపమానము. కళాశాలాధికారులవలనగాని, మరేయున్నతపదవిలో నున్నవారివలనగాని తోడివిద్యార్థుల కీషణ్మాత్రమన్యాయము జరిగెనను మేజినీ సహింపజాలక న్యాయముకొఱకు పోరుచుండెడి

వాడు. నిష్కల్మషమయినహృదయము; పవిత్రాంతఃకరణము; స్వార్థవిరహితమైన పదార్థప్రాపకత్వము; ధర్మనిరతి; నిర్భయత్వము మొదలగు సద్గుణపుంజము లాతనిని బాల్యమునుండియే వరించెను.

మేజినీతో మిత్రబృందము, సుహృద్వర్గము, అనుచరులు మొదలగువారెపుడును ధర్మసమరమునకు సంసిద్ధులగుచు శిక్షణమును బడయుచుండిరి. మేజినీ వారందఱికిని నాయకుడై చరిత్రను రాజకీయములను పఠించుట కొకసంఘమును స్థాపించెను. వారు నిరంకుశప్రభుత్వము చేనిషేధింపబడినపుస్తకముల నన్నిటిని రహస్యముగా సేకరించుకొని వాని నామూలాగ్రముగా జదువనారంభించిరి. రాజకీయప్రబోధము నేమాత్రము గలిగించుపుస్తకములైన నారోజులలో నిషేధింపబడుచుండెను. వార్తాపత్రికలకుకూడ నట్టియాంక్షయే యుండెడిది. ప్రభుత్వమును బలపరచునట్టిపత్రికలు మాత్రమే ప్రభుత్వమువారి యామోదమును బడయుచుండెను. ఈమిత్రబృంద మిట్టి నిషేధసాహిత్యమునంతను నమలి మ్రింగివేయుచు నూతనభావములతో నుట్టిపడుచు విప్లవమార్గముల నారయుచుండిరి. ఇంతేగాక మేజినీ ఫ్రెంచి, యింగ్లీషు, జర్మను సాహిత్యమును డేంటి బైరను, షేక్స్పియరు, బైబిలు మొదలగు నుత్కృష్టసాహిత్యమునంతను దివారాత్రములు కొల్లగొన నారంభించెను. మానవలోకాద్వైతతత్త్వము; మానవలోకసమగ్రత; సమస్త



చరాచరముల పాలించు ధర్మదేవతాద్వైతస్వరూపము; నిరుపమానదేశభక్తి; జగత్కల్యాణప్రాపణముకొఱకు నిరంతరసమరమే జీవితపరమార్థ మను నైతికశక్తి మొదలగు నుత్కృష్టభావములను మేజినీ, డేంటీమహాశయుని గ్రంథరాజములను పఠించి సంగ్రహించెను. ఇంతియేగాక నతడు ప్రపంచచరిత్రలను, రాజకీయములను, వివిధవేదాంతసారమునుగూడ సమగ్రముగా నాస్వాదించెను.

అతనికి మొదటినుండియు సాహిత్యమునం దభిమాన మపారము. అతడు గొప్పగొప్పనాటకములను, నద్భుతమైన చారిత్రకనవలలను వ్రాయవలెనని యువ్విళ్ళూరుచుండెడివాడు. తిలకుమహాశయుడు గణితశాస్త్రపారంగతుడు. గణితశాస్త్రమునే విద్యార్థులకు బోధించుటయందు పరమానందమునుబొంది యుండెడివాడననియు, ప్రస్తుతదేశదౌర్భాగ్యస్థితిచేత స్వరాజ్యసమరమేతనకు ప్రప్రధానకర్తవ్య మయ్యెననియు దెలుపుచుండెడివాడు. అట్లే మేజినీకూడ స్వదేశదాస్యదుస్సహదుఃఖభారమును సైపజాలక "నాటకములను వ్రాయుచు గూర్చుండుటకుగాని డేంటీ గ్రంథముల నధ్యయనము జేయుచు కాలక్షేపము చేయుచుండుటకుగాని నాకిపుడు సమయము కాదు. ప్రస్తుతదేశపరిస్థితులలో కేవలసాహిత్యముతో దృప్తిపొందుట దేశభక్తులకు పాడిగాదు. తనధర్మమును గ్రహించి దానిని నిర్వహించి తీరవలెననుబాధ్యతను గుర్తిం

చినకవి యెవ్వడు నిపుడు రాజకీయరంగమున పాల్గొనకుండ నుండజాలడు. పాఠకహృదయాంతరాళములందు స్వదేశాభిమానజ్వాలను, మానవలోకసేవను పెంపొందించుటే గ్రంథప్రయోజనము. భగవంతుని దృష్టియందిడుకొని రాజకీయరంగములో పనిజేయునట్లు ప్రజల నుద్బోధించుటే గ్రంథప్రయోజనము. ఋషీశ్వరులవలె నుండు తపోనిమగ్నులను ప్రశాంతహృదయులను తయారుజేయుట కిపుడు ప్రయత్నించుట వెఱ్ఱితనము. అట్టివా రిపుడున్నను నిర్గంధకుసుమములే యగుదురు. దుస్సహానేకదురాచారములతోను, దుష్టసంస్కారములతోను, జడత్వపిశాచములతోను నిండియున్న సంఘములో నిట్టి జీవిత మసంభవము; అసాధ్యము. నిరంకుశత్వము, దుర్మార్గము ప్రజలను పీడించి పిప్పిచేయుచు నిర్వీర్యులను చేయుచుండ, స్వేచ్ఛకొఱకు ప్రజ లాబాలగోపాలము కాతరపడుచుండ సమస్త ప్రాణ, మాన, ధనములను, సర్వసౌఖ్యములనుగూడ తృణీకరించి ప్రజాకళ్యాణమున కుఱుకుపురుషసింహములను తయారుచేయజాలనిమతముగాని, నీతిగాని మన కిపు డక్కఱలేదు." అని యతడు ముక్తకంఠముతో ఘోషింప నారంభించెను.

ఈసమయముననే యిటలీలో ప్రబంధరచన, స్వేచ్ఛారచన యనువాదప్రతివాదములు కవిమండలమున చెలరేగి వారిలో రెండుకక్షుల నేర్పరచెను. ప్రస్తుతమునకు సంబంధించని పురాణగాథలను బుద్ధికితోచినట్లు పెంచి, మార్చి, కల్పించి



యనేకఛందోనియమములతో భావనుబంధించి, వీనులవిందులకొఱకు వింతసోయగముల నందులో జొప్పించి, కర్ణేంద్రియసౌఖ్యములనుబడయుటే ప్రబంధరచనముయొక్క యాశయము. మేజినీయీవివాదలలో స్వేచ్ఛారచనను సమర్థించెను. దీనిలో లోపములుండవనియు, సాహిత్యమున కిదియే పరమావధి యనియు నతనియుద్దేశ్యము కాదు. దేశము సర్వతోముఖమైన స్వేచ్ఛను కోరుచు, ప్రస్తుతాంశములును, ప్రాణావసరములునగు ఆర్థిక, రాజకీయ, ఆధ్యాత్మిక ప్రబోధప్రచారము లెంతయో యవసరమై యున్నవని గ్రహించి యొక మహోద్యమమును, మహాయజ్ఞమును సంకల్పించిన సమయమున సాహిత్యదాస్యమును తెచ్చిపెట్టి, దానిద్వారా రాజకీయాభివృద్ధినంతను నరికట్టి వీనులవిందులతో గులుకుట ధర్మము కాదనియే యతనివాదము. దేశావసరములనుబట్టి, దేశకళ్యాణముకొఱకు సాహిత్యముకూడ మారుచుండవలెను. స్వేచ్ఛను, కళ్యాణాభివృద్ధులను పెంపొందించుసాహిత్యమున్ననే గాని దేశమునకు సాంఘిక, రాజకీయమోక్షములు చేకూర నేరవు. ఈసాహిత్యరాద్ధాంతసిద్ధాంతములకును, మనసాంఘికపౌరజీవితములకును నెంతయో సంబంధము కలదు. దేశముయొక్క సాహిత్యము ననుసరించియే శాసనములును మారుచుండును. దేశముయొక్క జ్ఞాన విజ్ఞానాభివృద్ధులు రాజకీయజీవితముపైననే యాధారపడియుండును. "ఇటలీదేశస్థులమహదాశయము

లను, మనోరథములను, కోరికలను, అవసరములను, సాంఘికోద్యమములను గుర్తించి వానిని బహిర్గతముచేయునూతనసాహిత్యమును వెదజల్లుచే స్వేచ్ఛాసాహిత్యవాదుల యభిప్రాయము. కాని కడుపుమాడుచుండ పీనులకు విందొనర్చు శబ్దవ్యూహములను కల్పించుచు గాలము బుచ్చుటకాదు." అని యతడు ఘంటాపథముగా సాహిత్యప్రయోజనమును దెలియపరిచెను.

మేజినీతో నిటలీలో నొకనూతనసాహిత్యము, నూతనాశయములు, నూతనచైతన్యము ప్రజ్వలింపసాగెను.

సాహిత్యము రాజకీయములయందవిచ్ఛిన్నముగా పాల్గొననారంభించెను. 'అభినవయిటలీ' (Young Italy) అను పదమును మేజినీయే మొట్టమొదట సృష్టించెను. ఈశబ్దమే త్వరలో యూరపులోనేగాక ప్రపంచమంతటను మారుమ్రోగి నిరంకుశప్రభుత్వములను దిగ్భ్రమ నొందింపజేసెను. ఇట్టి పరిస్థితులలో మేజినీ రాజకీయనిర్బంధితులకు జోహారు లొనర్చుచు దన కార్యక్షేత్రమును నిశ్చయించుకొనెను. ప్రభుత్వసంస్థలన్నింటి నామూలాగ్రముగా మార్చివేసినగాని నిరంకుశప్రభుత్వతత్వము మారదని యతడు స్పష్టముగా గ్రహించి చాటసాగెను. నూతనపత్రిక లనేకములు రాజకీయప్రచారమునకు గడంగెను. మేజినీ పత్రికలద్వారా ప్రచారమును ప్రారంభించి 'ఇండికెటోరు' అనుపత్రికకు వ్యాసములు



వ్రాయనొడంగెను. అంతటితో ప్రభుత్వనిర్బంధములు ప్రారంభమయ్యెను. అతడు వ్రాయుటకు ప్రారంభించినసంవత్సరములోపలనే యాపత్రిక యణచివేయబడెను. వెంటనే దానిపేరిటనే మరియొకపత్రిక స్థాపింపబడెను. మేజినీ ద్విగుణీకృతోత్సాహముతో మరల దీనికిగూడ వ్యాసములను వ్రాయుచు ప్రజలలో నుత్తేజమును గలిగించుచుండెను. కాని యీ పత్రికగూడ సంవత్సరము గడచీగడియకమునుపే ప్రభుత్వమువారిచే నణచివేయబడెను. మేజినీ మరల తనప్రచారమును 'ఏంటలజియో' యను మరియొకసుప్రసిద్ధపత్రికద్వారా సాగింపనారంభించెను. అతనిసంబంధమున్నప్రతిపత్రికగూడ సంవత్సరము గడియకమునుపే ప్రభుత్వబారికి గురియగుచుండెను.

ఇది యిట్లుండ నతడు న్యాయవాదపరీక్షయందుత్తీర్ణుడై ప్లీడరీవృత్తిలో బ్రవేశించెను. అతడు క్రిందకోర్టులలో బీదలతరపున వాదించుటకే తనకాలమును వినియోగించుచుండెడివాడు. ఆవృత్తియందు పేరుప్రతిష్ఠలనుకూడ నతడచిరకాలములోనే సంపాదించెను. కాని త్వరలో యూరపునంతను దిగ్భ్రమనొందింపవిధింపబడినవ్యక్తి స్వోదరపోషణకొఱకు బల్ల గ్రుద్దుచు నెట్లూరకుండగలడు! అతనిక్షేత్రము కర్మక్షేత్రము; రంగము రాజకీయరంగము; ధర్మము మానవధర్మము; ఇక నతని నెవరాపగలరు! నెపోలియను నిర్బంధింపబడి

ఆతరువాత జినీవా పరప్రభుత్వహస్తగతమైన దను సంగతి మన మిదివఱకే వినియున్నారము జినీవాలోనున్న ప్రభుసంతతివారు సామాన్యులు, కర్షకులు మొదలగువారెవరును దీని నామోదింపజాలకుండిరి. మేజినీ వారినందఱను చేపట్టెను. 'కార్బనరి' యను రహస్యసంఘములు దేశములో నచ్చటచ్చట బయలుదేరినసంగతికూడ యిదివఱకేచూచియుంటిమి. మేజినీ యీసంఘములలో నిదివఱకే యగ్రస్థానమును వహించెను. కాని యీసంఘములు తగినంతపటుత్వమును గలిగియుండక నామమాత్రావశిష్టముగా నుండుటను మేజినీ చూచెను. వానిలోనున్నలోపములనుకూడ నతడు కనిపెట్టెను. అతని యాశయములముందర నాసంఘములలో నదివఱకున్నయాశయములు చాల లేశాలేశములు. ఈసంఘములకు నాయకు లెవరో, తానెవరియాజ్ఞలను శిరసావహింపవలెనో, తనతోడికుట్రదారు లెవరో, వారికి రాజకీయపథక మేదియేనికలదో, లేదో, యను సంశయము లతని కెన్నియో కలిగెను. ఇవన్నియు రహస్యముగానుంచబడెను. కొంతమంది యిటలీనిగురించి తేలికగా మాటలాడుచు ఫ్రెంచిదేశమువలన నిటలీదేశము మోక్షమునుపొందవలెనని మాట్లాడునపు డతనిలోనున్న యిటాలియను రక్తముడికిపోవుచుండెడిది. "తన స్వశక్తివలన సంపాదించనిదే యేదేశముగాని, యేజాతిగాని స్వాతంత్ర్యమునకు, స్వేచ్ఛకు నర్హతను బడయజాలదు; అట్టిదొకవేళ సంభవించినను చిర



కాల ముండజాలదు. ప్రజలవలననే ప్రజలకొఱకే విప్లవములు ప్రారంభింపబడవలెను." అనుసత్యము నతడు ప్రకటింపదొడగెను. ఇంతేగాక నాసంఘములలెక్కలు సరిగా లేకపోవుట, నాయకులను విమర్శించుచో కఠినదండనలకు గురిచేయబడుదు రను నసందర్భనియమములెన్నియో యతనికి గోచరమయ్యెను. అతడు వెంటనే ప్రచారము నారంభించి టస్కనీమొదలగుకొన్నిచోట్ల నూతనసభ్యులను జేర్పించెను. ఈసంఘములను వీర్యవంతముగాజేసి వీనిద్వారా తనయాశయములను, సంకల్పములను నెఱవేర్చుకొనవలెనని యతడు నిశ్చయించుకొనెను. టస్కనీ, బొలానా, పైడ్మాంటు, జినీవా మొదలగు నన్నిప్రదేశములలోనున్నరహస్యసంఘములనన్నింటి నేకముఖమునకుదెచ్చి తీవ్రసంఘర్షణమును ప్రారంభింపవలెనని యతనితలంపు. ఈసంకల్పముతోనే యతడు బొలానాకు వెళ్ళవలెనని, డేటీకవిత్రాతప్రతిని పరిశోధింపవలెనను మిషతో ప్యాసుపోర్టును కోరగా ప్రభుత్వము దానిని నిరాకరించిరి. అత డింతమాత్రముచే నిరుత్సాహపడక జినీవాలోనుండియే కుట్రలను సాగింప కృతనిశ్చయుడయ్యెను.

ఇంతలో ఫ్రాన్సులో "జూలైవిప్లవము" అను పేరిట నొక విప్లవోద్యమము బయలుదేరెను. దీనివలన నిటలీలో లిబరలుపక్షమువారికి కొంతయాశ యుదయించెను; వారిలో సంచలనము బయలుదేరెను. మేజినీ యీయవకాశమునుగై

కాని తనస్నేహితుల నందఱను పోగుచేసి తిరుగుబాటు చేయుటకవకాశమున్నచో 'తిరుగుబాటుచేయుటకు సంసిద్ధులము కాగల' మను ప్రమాణములతో ననేకమందియువకులను జేర్చెను. గుండ్లు తయారుచేయబడెను. నానావిధాస్త్రశస్త్ర సామగ్రియు సమకూర్చబడెను. యుద్ధసంభారము లన్నియు నమర్చబడెను. చివరకీవిప్లవము ప్రారంభములోనే త్రుంచి వేయబడెను. ఈరహస్యసంఘములలో గూడ ప్రభుత్వము వారి గూఢచారులు ప్రవేశించిరి. వారిని విప్లవము కుద్బోధించెనను నేరము మేజినీపై మోపబడెను. ప్రభుత్వగూఢచారు లతని నెప్పుడును వెన్నంటుచునే యుండిరి.

"మేజినీ బుద్ధిబలసంపన్నుడు ఆతడు రాత్రిలం దెప్పుడును యొంటరిగా దిరుగాడుచు గభీరచింతానిమగ్నుడై యుండును. ఇట్టిపిన్నవయస్సులో నత డట్టి తీవ్రయోచనానిమగ్నుడగుటకు గతంబేమి? యువకులు చేయుయోజనలవిషయ మెద్దియో మాకు దెలియకుండ వారు యోజించుటను మేమంగీకరింపజాలము." అని యతనినిర్బంధమునుగుఱించి జెనీవా గవర్నరతనితండ్రితో జెప్పెనట!

ఇట్లిరువదియాఱవయేట మేజినీ మొదటిసారి నిర్బంధింపబడి సెవనాకోటలో నుంచబడెను. కేసు విచారణకు వచ్చెను. మేజినీపై కేసు రుజువుకాలేదు. కోర్టువా రతనిని న్యాయము ప్రకారము విడిచివేయవలసివచ్చెను. కాని ప్రభుత్వము



వా రతను రాజకీయాందోళనకంతకును మూలపురుషుడను నెపమును మోపి దేశాంతరవాసశిక్ష లేక యేదేని యొకపట్టణములో ప్రవాసము యను రెంటిలో నొకటి కోరుకొనవలసినదని తీర్పుచెప్పిరి. ఈసమయములోనే మధ్యయిటలీలో గూడ విప్లవము బయలుదేరుటచే తా నితరదేశములలో నున్నచో దానికి తోడ్పడవచ్చునని దేశాంతరవాసమునకే యంగీకరించి 1831 వ వత్సరము ఫిబ్రవరినెలలో మేజినీ తన కుటుంబమునుండియు, స్నేహితులనుండియు, చిన్నవాడలనుండియు శలవుగైకొని లియాన్సునకు పయనమై వెడలిపోయెను.

---

## 'అభినవయిటలీ' ప్రబోధము.

మేజినీ సెవనాకోటలోనున్నపుడు బైబిలు, బైరను, టేసిటసు మొదలగు గ్రంథములతనికి చదువుకొనుట కిచ్చిరి. ఇవి కేవల మతగ్రంథము లనియు, వీనిలో విప్లవమును ప్రోత్సహించువిషయము లేమియు నుండవనియు ప్రభుత్వమువా రాశించిరి. కాని తానొకటితలచిన దైవ మొకటితలచు నను సంగతి మనమెఱుగనిది కాదు. ఈసామగ్రినుండియు, డేంటీ కవిగ్రంథములనుండియు 'అభినవయిటలీ' యుద్యమ ముద్భవించెను. ఇటలీగూడ నీనూతనోద్యమప్రబోధమును గ్రహింపగలస్థితికివచ్చెను.

ఇటలీదేశము నైసర్గిక మర్యాదల ననుసరించి 'భూగోళములో నొకభాగము' దీని నెవరును ముక్కముక్కలుగా

చీల్చివేయరాదు అనునాగతి ప్రజలలో గాఢముగా నాటుకొననారంభించెను. రాజులు యెవరికిదొరికినంతవఱకు వారు యిటలీని ముక్కముక్కలుచేసి పంచుకొని తమనిరంకుశత్వమును చెలాయించుచుండిరి. ఇక వారివలన ప్రజలు పడుబాధలకలవియే లేకుండెను. వెనీసుపట్టణ మద్వితీయమైనప్రజాస్వామికప్రభుత్వము ననుభవించెను. ఆస్ట్రియాదేశ మట్టి వెనీసును, లాంబార్డీప్రదేశమును దిగమ్రింగెను. పైడ్మాంటుదేశపురాజు సార్డీనియా, సెవాయి, పశ్చిమోత్తర యిటలీలను స్వాహాచేసెను. బోర్బనులు దక్షిణయిటలీని తమహస్తగతము చేసికొనిరి. టస్కనీ, మోడినా, పార్మా, లూకా మొదలగు ప్రాంతములలోనిప్రభువులు మధ్యయిటలీనంతను చీల్చివేసి పంచుకొనిరి. ఈపంపకమువలనను, వీరినిరంకుశచర్యలవలనను ప్రజలు పడుబాధలకు మేరలేకయుండెను. నెపోలియనుచక్రవర్తి దేశమునంత నేకముచేసి సుభిక్షముగా పరిపాలనను సాగించెను. కొన్నిపట్టణము లదివఱకు ప్రజాస్వామికపరిపాలనమునే యనుభవించుచుండెడివి. ఇప్పుడన్ననో? ఎవడికివాడు దేశమును పంచుకొని కృత్రిమయడ్డంకులను కల్పించి జాతీయజీవితప్రవాహము నరికట్టివేసిరి. ప్రజలీబాధల కోర్వజాలకయుండిరి. ఒకవంక దేశమంతటను బాహాటమైనవర్తకము చేసికొనుటకా వీలులేదు. ఒక్కొక్కప్రభుత్వమున కొక్కొక్కసుంకమును చెల్లించవలెను. దానితో వర్తకము కొనయూపిరి విడుచుచుండెను. సాహిత్యమూ నిరంకుశప్రభువులచేతులలోబడి నలిగిపోవుచుండెను. నూరుమైళ్ళదూరములో లెగ్హారను, ఫ్లారెన్సుయనుచోట్ల ప్రచురింపబడిన గ్రంథములు జినీవావచ్చుటకు వీలులేదు. ఏవ్యాపారమునకు వీలులేనట్టి చిన్నచిన్న ప్రభుత్వము లెన్నియో కుక్కగొడుగులవలె తలయెత్తి ప్రజాభివృద్ధిని నాశముచేసెను దేశమంతటను నిరంకుశ, దుష్టపరిపాలనమే తప్ప వేరొండు కానరాదు. అంతయు రావణరాజ్యమువలెనుండెను. చట్టములను నిర్మించుకొనుటలో ప్రజలకు స్థానములేదు. పన్నులను విధించుకొనుటలో వారిప్రసక్తియేమియులేదు. ప్రభుత్వవర్గములో వారికెట్టి స్థానమును లేకుండెను. స్వేచ్ఛగా తిరుగుటకు, స్వేచ్ఛగా వ్రాయుటకు, స్వేచ్ఛగా నుపన్యసించుటకు, సభలు, ఉత్సవములు మొదలైనవి జరుపుటకు నిర్బంధము లనేకవిధములుగా ప్రయోగింపబడుచుండెను. ప్రజల కెట్టివిద్యయు గరుపబడకపోవుట, పాక్షికతత్వముతో నిండిన న్యాయపరిపాలన, పోలీసువారిదౌర్జన్యములు, బెదరింపులు, యెంతటిగృహస్థుయింటినైనను జబర్దస్తీగా సోదాచేయుట; వారిజీవితములను గౌరవములను, భంగపరుచుట మొదలగు నమానుషచర్యలతో ప్రజలను రెచ్చగొట్టుచుండిరి. ఈవిధముగా కత్తితో రాజ్యముచేయు నిరంకుశప్రభుత్వము లెప్పు డెచ్చట విప్లవములు బయలుదేరునో యనుభయభ్రాంతతచే వీధివీధికి, యింటింటి

గూఢచారులను, వేగులవాండ్రను బంపి ప్రజాశాంతి యను పేరిట ప్రభుత్వపద్ధతులను విమర్శించువారినందఱను శిక్షల కాహుతి చేయుచుందురు. కొన్నిచోట్ల నీయాగడములకు హద్దుపద్దులుకూడ లేకయుండెను. ప్రజలీయనవ్యాచర్యలను తీవ్రనిర్బంధములను భరింపజాలక నివారణసాధనములకొఱ కాతురపడుచుండిరి.

పైన వివరించిన కార్బనరీ యనురహస్యసంఘములు శాంతపడకు ప్రతిఘటనమును సాగించెను. 1831 లో మధ్య యిటలీలోగూడ విప్లవము బయలుదేరిన ట్లిదివఱకే వినియుంటిమి. ఈవిప్లవాగ్ని మోడినాలో బయలుదేరి పార్మా, రోమగ్నా యను రాష్ట్రములను చుట్టబెట్టెను. మూడువారములలో పోపురాజ్యములో చాలభాగము విప్లవకారులవశమగుటయేగాక రోముపట్టణముపైకిగూడ విప్లవసైన్యములు తరలెను. రోమును జయించు టంతకష్టము కాకపోయినను ఆస్ట్రియా కలుగజేసికొనినచో పరిస్థితులు క్లిష్టమగునని విప్లవకారులెఱుగుదురు. తమస్వదేశరాజకీయములలో నాస్ట్రియా కలుగజేసికొనినచో తమకు సహాయముచేసెద మనియు, నాస్ట్రియాపై యుద్ధము ప్రకటించెద మనియు ఫ్రాన్సు మొదట విప్లవకారుల కభయహస్త మిచ్చెను. కాని చివరకు ఫ్రాన్సుదేశపులూయిచక్రవర్తి యీజాతీయోద్యమ మొకవిప్లవోద్యమముగా మారి తనకే మోసము కలుగునను భయముతో



వాగ్దానభంగ మొనర్చి మిన్నకుండెను. ఆస్ట్రియా వెంటనే యీయుద్యమము నణచివేసెను. ఈయుద్యమములో నున్న లోపములే దీనికి కారణమని మేజినీ తలంచెను. ఉద్యమనాయకులు ప్రజాసామాన్యముతో సంపర్కములేని యుద్యోగస్థుల తరగతిలోని వారు. వారు సత్యమును గ్రహింపజాలక తమ కెవరో సహాయముచేయుదు రనియు, వారిసహాయముపై స్వరాజ్యమును బడయగల మనియు రొట్టెలువేయుచు పడకకుర్చీరాజకీయవ్యూహములతో వ్యవహారము జరుగునని చూచిరి. ఆస్ట్రియాతో యుద్ధముచేయుటకు వారికి వణకుజనించెను. మేజినీ యీసంగతులను గ్రహించెను. నూతనసంస్థలును, నూతనమనుష్యులును కావలెను; కార్యశూరులు కావలెను; యుద్ధప్రవీణులు కావలెను. స్వాతంత్ర్యాగ్నితో దహించుచున్న యువకులు కావలెను. నూతనాశయములు, నూతనోత్సాహము, సంపూర్ణయాత్మవిశ్వాసము, నిరంతరకార్యదీక్ష "ప్రజలకును, యువకులకును, విప్లవోద్యమనిపుణులకును" దివ్యసందేశము నొసగగలదటులు. ఇవియే యీ తరుణమున గావలెను. తనతరమువా రిట్టిశక్తిసంపన్ను లని మేజినీకి సంపూర్ణవిశ్వాస ముండెడిది. 'మన యీయభినవయిటలీ' అను నొకవ్యాసములో మేజినీ యిట్లువ్రాసెను. "విప్లవోద్యమరతులయిన ప్రజాసామాన్యమున కీయువజనుల నధినాయకులనుగా జేయుడు. ఈయువకబృందములో దార్వాంత

స్థితపావకమువలె నంతర్హితముగానున్నయనంతశక్తిని మీ రెఱుగరు. ప్రజాసామాన్యముపై వారికిగల పలుకుబడి యా త్యద్భుతమైనది. వారిలో మీరు నూతనమతదివ్యసందేశజ్యో తులను లక్షోపలక్షలుగా గాంచగలరు. చైతన్యమే యౌవన లక్షణము; ఉత్సాహ, శ్రద్ధాభక్తులచేతనే యది దినదినప్రవ ర్ధమానమగును; వారి నేదేని యొకయుత్కృష్టధర్మనిర్వహ ణమున కర్పింపుడు; వారిశక్తిసామర్థ్యముల నభినుతించుడు. వారిద్వారా యొకవంక యుద్ధమును, మఱియొకవంక జ్ఞాన మును వ్యాపింపజేయుడు. దేశము, యశము, శక్తి, ఉత్కృష్ట త, యిటలీ మొదలగునవియే వారికి రామస్మరణలు"

ఇట్టి యువకుల 'మూతులుబిగియగట్టి' నిరంకుశప్ర భువులు చెలరేగుచున్నారు. ఇకముం దిట్టిది సాగజాలదు. అని మేజినీ చాటెను. ఈనూతనసంస్థయొక్కసూత్రములు చాల కట్టుదిట్టముగా చేయబడెను. తగినంతకారణము లేనిదే నలుబదిసంవత్సరములు పైదాటినవారి నిందులో జేర్చుకొన రాదనికూడ తీర్మానింపబడెను. "మేజినీకి తన స్నేహితులయం దత్యంతవిశ్వాసము; ఇక తనయందలి యాత్మవిశ్వాసమునకు మేరయేలేదు." అని యతని బాల్యస్నేహితుడు చెప్పుచుండెడి వాడు. "జాతీయమహోద్యమము లన్నియు సామాన్యమానవు లలో నున్న యూరుపేరులేని వ్యక్తులనుండియే బయలుదే రును. వారి కట్టిపలుకుబడి లేకున్నను కాలమునుగాని, దు



స్సహసంకటములనుగాని యొంతమాత్రమును సరకుగొనని యాత్మవిశ్వాస, యిచ్ఛాశక్తిసంపదయే వారిపాలిట కల్ప వృక్షము."

మేజినీయొక్క వ్రాతలును, ఆశయములును, నూతన సంస్థలును యిటలీయువకులలో నూతనోత్తేజమును కలిగిం చెను. పరప్రభుత్వదాస్యశృంఖలాబద్ధమై, నిర్వీర్యమై, నిస్తే జసమై, యాత్మజ్ఞానమును, నాత్మవికాసమును గోల్పోయి ని రాశ, నిరుత్సాహము, మందగొడితనము, యశక్తత, కావ్య శూరత్వవిహీనత మొదలగు దుర్గుణసంచయములతో క్రుంగి పోయినదేశమును పునరుద్ధరించుటకై నూతనమతావేశము, నూతనసిద్ధాంతము, నూతనరాజకీయవేదాంతము అత్యవస రము. మేజినీ దీనిని గ్రహించి నిర్జీవప్రతిమలకు ప్రాణప్రతిష్ఠ చేసినట్లు యిటలీయువకులను వీర్యవంతులను జేసెను. "భగ వంతుడు- ప్రజలు; భగవంతుడు- ప్రజలు" అనునదే యతని యద్భుతనూతనరణదుందుభి; శంఖారావము. "ఇటలీయస్థి పంజరమువలె శల్యమాత్రావశిష్టముగా నుండనక్కరలేదు; అట్లుండరాదు. విధికంటెకూడ బలవత్తరమై, విధినిధిక్కరింప జాలునట్టి యంతర్హితశక్తి, చరిత్రనంతయు దృటిలో మార్చివేయ జాలునట్టి యంతర్హితశక్తి, భూమ్యాకాశములను తల్లక్రిందులు చేయజాలునట్టి యిచ్ఛాశక్తి యిటలీలో నింకను తేజరిల్లుచు న్నది." అని యత డుద్ఘోషించెను.

"మహాసామ్రాజ్యాధిపత్యమును వహించినయిటలీని తలచుకొనుడు! ప్రపంచమునంతను చావచుట్టగాచుట్టిన రోమకసామ్రాజ్యమును స్మరించుకొనుడు! వెయ్యేండ్లు మనమిట్లు మూకదాస్యకలాపమున బడి నలిగిపోవుచున్న నాచందార్ఢ్యముగ నిలిచియుండుదాని పురాతన యశఃకాంతులను, దివ్యస్మరణములను, మహోల్లాసపూరితమగు నవజయవిచారాదులను నెవడును నాశన మొనర్పజాలడు." రెండుసారులామె ప్రపంచసామ్రాజ్యము ననుభవించిన రాణి యయ్యెను. మహాకవులగు డేంటీ, వైకోలపుణ్యభూమి; పోపు, విజ్ఞానాభ్యుదయములకు పుట్టినిల్లునయిన యిటలీ యూరపునంతననేకసారులు నూతనభావములతో ప్రబోధపరచెను. "ఇటలీ శ్మశానవాటిక" యని పిలువబడుచున్నది. నిర్వీర్యులై, జీవచ్ఛవములై, దుర్బలులై, కబుర్లపోగులై నివసించుచున్న మానవనామధారులతో గూడియున్న యిటలీకంటె మహావీరాధివీరుల దేహములతో నిండియున్న సమాధిస్థలమే చైతన్యయుతమైనది. ఆమె తన ధర్మము నింకను నెఱవేర్చలేదు. ఒకనూతనయుగసందేశమును, మానవలోకదివ్యసందేశము నామె సమస్తజాతులలోను ప్రజ్వలించునట్లు చాటవలసియున్నది. దుస్సహసంకటాగ్నిలో తప్తులమై, పూతచరితులమై (యిటలీ నశించెనని దుర్భ్రమతోనున్న జాతులలో) జ్యోతివలె ప్రకాశించుచుండునట్టియిటలీనే మీరు చూడగోరె



దను అను నిట్టి యద్భుతమంత్రములతో మేజినీ యువకబృందమును కదల్చివేసెను.

ఇంతేకాదు. ఇటలీతిరిగి యుదయింపవలెనన్న వేలకొలది మనుష్యులు జీవితముల నర్పింపవలెను; ప్రాణ, మాన, ధనములను కోల్పోవలెను; దేశాంతరవాసముల ననుభవింపవలెను; ఖయిదులు, దారిద్ర్యము, బంధుమిత్ర, కళత్రాదులనుండి దూరులగుట; గృహములు నశించిపోవుట; ఆప్తులు యమబాధల నందుచుండుట మొదలగు నగ్నిపరీక్షలలో శలభజాలమువలె నెన్నివేలమందియో తప్తులుగాకుండ నిది వచ్చునదికాదని మేజినీ పూర్తిగా నెఱుగును. ఇంతపనిచేయుటకును, చేయించుటకును, కేవలస్వప్రయోజనము, స్వార్థము పనికిరాదు. 'ధర్మము; ధర్మము; ధర్మమే మోక్షసాధనము.' అని మేజినీ ప్రకటించెను. "నేను మీకు జాతీయమతమును బోధించుచున్నాను. 'అభినవయిటలీ' కేవల మొక రాజకీయపక్షముగాదు. అదియొక తత్త్వము; ఒకసిద్ధాంతము; ఒకదివ్యసందేశము. సిద్ధాంతములను గౌరవించుట; న్యాయ, సత్యములయందు తత్పరులై యుండుట; త్యాగము; నిరంతరత్యాగము. ఇవియే జయమును చేకూర్చగలవు. ప్రతివ్యక్తికిని, ప్రతిజాతికిని గూడ నొకధర్మము భగవంతుడే నిర్మించెను. మన మాధర్మమును నిర్వహింపవలసినదనియే యతనిశాసనము. అభివృద్ధియే మనపరమావధి యనుభగవం

తునిశాసనమే మనకు జయమును చేకూర్చును." అభినవ యిటలీ'యొక్క ప్రధానసూత్రములలో ధర్మము మొదటిది.

రెండవది సంఘసంస్కారము. ప్రజాసామాన్యమును కదల్పవలెనన్న కేవలధర్మబోధయే వారికి చాలదు. సంఘములోనున్న దుర్మార్గములు, అత్యాచారములు, హెచ్చుతగ్గులు మొదలగునవి రూపుమాయవలెను. విప్లవము సంఘమంతకును పనికిరావలెను. "ప్రజలకొఱకే విప్లవములు ప్రజలలోనే ప్రజలవలననే బయలుదేరవలెను. ఏకొద్దిమందియో యేయొక్కతరగతియో పైకిలేచి యొకతరగతినుండి యధికారమును మరియొకతరగతికి మార్చుచు వచ్చినను లాభము లేదు. దానివలన దేశమునకు మోక్షము చేకూరనేరదు." ఈరెండుసిద్ధాంతములను మేజినీ బాహాటముగా ప్రకటించెను. దరిద్రనారాయణుల యార్తారావము లతనిచెవులబడుటతోడనే యతనియొడలు కంపించుచుండెడిది. "రాజకీయదాస్యము, దరిద్రము, ఆకలిబాధ, దిగంబరత్వము ప్రజలను బాధించుచుంట నేను కండ్లార చూచుచున్నాను. వారన్నాతురులై ధనాంధులచే తిరస్కరింపబడి, యవమానములకు దోసిలొగ్గి వారి యుచ్ఛిష్టమును మహాప్రసాదముగా స్వీకరింపవలెను. మన పోరాటములో మనకండగానున్న దైవమే యచ్చట వారితిరస్కృతవదనములలో నాకు స్పష్టముగా గాన్పించుచున్నాడు.



ప్రజ లైక్యకంఠముతో నేకాశయబద్ధులై, ప్రేమ, సమభావము, నాగరికసద్గుణగణములతో నొప్పుచు దమయనంతశక్తితో లేచుచున్న భావిదృశ్యము నాకన్నులకు గట్టినట్లు కాన్పించుచున్నది. దరిద్రబాధచే పీడింపబడక, భోగలాలసచే మత్తులుగాక, సత్య, ధర్మముల నెల్లపుడు జ్ఞప్తియందుంచుకొని వానిని కాపాడుకొన బద్ధకంకణులైనభావిప్రజలు నాకు గాన్పించుచున్నారు. అట్టిదృశ్యమును జూచు నా హృదయము ప్రస్తుతప్రజలబాధకు సంతాపమును భావిప్రజలకొఱకానందమును బొందుచున్నది. భగవంతుడెప్పుడును నిరంకుశులచే పీడింపబడుదీనులయెడ నుండును." అని యతడు హెచ్చరించుచుండెడివాడు.

ఈరెండుసూత్రములపైనను మేజినీ తనరాజకీయోద్యమమును స్థాపించెను. విప్లవకారులలో భేదాభిప్రాయములుండకూడదనియు, కార్యరంగమున కురకవలసినసమయములో, శత్రువు మెదుటకు వచ్చినపుడు వితండవాదములతో పొద్దుపుచ్చుట యాత్మనాశమునే దెచ్చిపెట్టుకొనుట యనియు నతడు దెలిపెను. కార్బనరీరహస్యసంఘము లిట్లే విఫలములయ్యెనని యతడు గ్రహించెను. వారిప్రయత్నములం కొంతసిద్ధిని గాంచుటతోడనే వారిలో వారు సంకుచితసంస్కరణవాదులు, విశాలసంస్కరణవాదులు, ప్రజాస్వామికప్రభుత్వవాదులు, ప్రభుభక్తిపరాయణులు అను తరగతులుగా

చీలి చివరకండఱును గూడ పరాభవము నొందుచుండిరి. ‘ఒకసంఘము యొక్క బలము దానిసంఖ్యపై నాధారపడియుండదు; కొద్దిమందియున్నను సంఘభావమే బలము.’ అని యతడు స్పష్టపరచెను. రాజకీయవేత్తల పెనుభూతమైన భయమే మితవాదులు తనమతము సంగీకరింపకపోవుటకు కారణము. “మంచిచెడుగులు, సత్యాసత్యములు, వృద్ధిపతనములు, వీని మధ్య యెన్నడును రాజీ పనికిరాదు.” అని యతడనేకసారులు వ్రాసెను.

ఇటలీయంతయు నేకముకావలెను. ఇటలీకి ప్రజాస్వామికప్రభుత్వము కావలెను. అను రెండును మేజనీయొక్క ప్రధానాశయములు. ఇటలీలో ననేకజాతులు, అనేకమతములు అనేకభాషలు, అనేకాచారములు కలవనియు నొకరాష్ట్రముకు మఱియొకరాష్ట్రముకు కలయిక యుండనేరదనియు చాలమంది యభిప్రాయము. మేజనీకిమాత్రము యిటాలియనుల యైక్యతయట్ల నకుంఠితవిశ్వాసముండెను. ఇటలీ యేకముకాక తప్పదని యతడు ఘంటాపథముగా చాటెను. ఇతరులెవరికిని యట్టివిశ్వాసము లేదు. చివర కతనివిశ్వాసమే యతనియనుచరులను, ప్రజలను రాజకీయవేత్తలను యసంభవమనునది సంభవమని గ్రహించునట్లు మార్చివేసెను. ఒకమహోత్కృష్టమైనరాజకీయాదర్శమును సృష్టింపగల మహాత్ములత్యల్పముగానుందురు. దానిని సృష్టించుటేగాక సాధించుటలో గూడ



ముఖ్యపాత్రను వహించి మేజనీ యాధునికయూరపుచరిత్రకారులలో నగ్రస్థానమును వహించెను. ఆస్ట్రియాతో యుద్ధము చేయకుండ రాజకీయాభివృద్ధికాని, యిటాలియనుల యైక్యత గాని, ప్రజాస్వామికప్రభుత్వముగాని యసంభవమని యతడు గ్రహించెను. యుద్ధరంగములో గాని యాస్ట్రియా తనచేతిక్రిందనున్న రాష్ట్రములను విడిచిపెట్టదు. నిరంకుశప్రభుత్వము ప్రక్క స్వేచ్ఛాప్రభుత్వములుండుట వారికి గిట్టదు.

ఆస్ట్రియా యిదివఱలో బయలుదేరినవిప్లవోద్యమముల నణచివేసెను. అది “మన ప్రాణములను, దేశమును, పేరుప్రతిష్ఠలను, జ్ఞాన విజ్ఞాన ధనములను, సమస్తైహికసంపత్తును కొల్లగొనెను. ఇంకను కొల్లగొనుచున్నది. ఆస్ట్రియాతో శాంతిమార్గమసంభవము. లొంబార్డీయుద్ధభూములందే యిటలీవిధి నిర్ణయింపబడవలెను. ఆల్ప్సుపర్వతములబయటనే శాంతిపత్రముపై సంతకములు జరుగవలెను.” అని యతడు బోధించెను. ధర్మసంరక్షణముకొఱ కవసరమైనచో యుద్ధమవలంబనీయమేయని యతని మతము. “యజమానిక్రింద బానిసత్వముచే కృశించుచున్న బానిస తనదాస్యశృంఖలములను ద్రెంచుకొన ప్రయత్నించునపుడు యుద్ధమే యతనికి శరణ్యము.” అని యతడు చెప్పెను.

డచ్చివారు ఫిలిప్పుతోను, అమెరికనులు యింగ్లీషువారితోను, చేసినట్లే యిటలీయును సుశిక్షణము గలిగి సమస్తాయుధ

సంపత్తియు, సైన్యబలమును గలశత్రువుతో దలపడునపుడు బాహాటమైన పోరాటముగాక సమయము చిక్కినపు డొక్కమ్మడి శత్రువుపైబడుచు, నరణ్యములలోను, పర్వతములలోను దాగొనుచు, మరల శత్రువును డీకొనుచు, శత్రువును పీడించవలెను. అనేక పర్వతపంక్తులతో గూడియున్న యిటలీలో నీపద్ధతి తప్పక జయమును గాంచగలదు. "ఓ యిటాలియనసోదరులారా! అవిగో! ఆసాంద్రారణ్యములు! ఆభయంకరపర్వతశ్రేణులు! అచ్చటనే మీబలము, మీజయముయున్న దని గ్రహింతురు గాక ?"

పైన వర్ణించిన మేజినీయొక్క భావప్రచారమును సాగించుటకు 'అభినవయిటలీ' ప్రజాప్రబోధమును, ప్రతిచోటను సంస్థల నేర్పరచుటను ప్రారంభించి ద్విగుణీకృతోత్సాహముతో రంగమున బ్రవేశించెను. దానికి గూడ రహస్యపద్ధతి దక్క మరొకటి యవలంబనీయము గాకపోయెను. కాని నిరంకుశప్రభువు లీపరిస్థితులలో నెట్లూరకుండగలరు. వారుసహస్రాక్షులు; సహస్రపాదులు; సహస్రకర్ణులు. వెంటనే 'అభినవయిటలీ'గూడ గూఢచారులు వేగులవాండ్రు మొదలగుప్రభుత్వపక్షుల కాటపట్టయ్యెను. మేజినీ వెనువెంటనే నిరంతరము గూఢచారులు స్నేహితులవలె నటించుచు సర్వస్వమును ప్రభుత్వమున కెఱుకచేయుచుండిరి. విశాలభావములను బహిరంగముగా నోరువిప్పి చెప్పుట యురికంబమో, ఖ



యిదో, ద్వీపాంతరవాసమో ప్రసాదించునట్టిమహాదోషముగా నెంచబడునిరంకుశప్రభుత్వములే యిట్టి రహస్యసంఘములకు కారణము లగుచున్నవి. స్వాతంత్ర్యయిటలీని నిర్మించుటలో నీ 'అభినవయిటలీ' యొక్క కృషియే ప్రధానస్థానము వహించెను. దేశములో మూలమూలలకు నతిరహస్యముగా వెదజల్లిన రాజకీయకరపత్రములు, నాటకములు, నవలలు, చరిత్రలు, కథలు, పాటలు, గీతములు, భజనకీర్తనలు మొదలగురాజకీయసాహిత్యము రక్తనాళములలో దేశభక్తి రవంతయేనియు కలిగిన యిటాలియనుయువకులను కదల్చివేసి సాయుధపాణులను చేసెను. ఈప్రచారము క్రమముగా యూరపు అంతటను ప్రాకి విప్లవాగ్ని యూరపునే చుట్టివేయు సూచనలు గాన్పించెను. మేజినీ కాలముకొఱకెదురుచూచుచుండెను. "రెండుకోట్ల యరువదిలక్షలయువకు లొకజాతీయమహోద్యమమును సాగించుచున్నపుడు దేశములో సంస్థానములు దానికి సాయముచేసినను, చేయకున్నను, దాని కెట్టివిపత్పరంపరలు సంఘటిల్లినను సరే యీ జగన్నాథరథ మాగునది కాదు." అని మేజినీ యుద్ఘోషించుచుండెను.

---

## మార్సేల్సు.

మేజినీ దేశాంతరవాసమునే కోరుకొని లియాన్సుచేరెను. అతడు విద్య నభ్యసించుచుండురోజులలో దేశాంతర్గ

తులైన రెండువేలమంది యిటాలియను యువకు లచ్చట నుండిరి. వారు ఫ్రాన్సుయొక్క సహాయముతో సెవాయిమీద కురుకవలెనని యుద్ధసన్నాహములను చేయుచుండిరి. ఇంతలో ఫ్రాన్సు వాగ్దానభంగ మొనర్చుటచే విప్లవకారులు చెదిరిపోయిరి; మేజినీ కొంతమందిని తీసికొని కార్సికాకు పయనమయ్యెను. అచ్చటనున్న విప్లవకారులను కూడగట్టి ముందు ప్రయత్నములను సాగించవలెనని యత డూహించెను. రెండువేలమంది యీ విప్లవకారులకు సహాయము చేయుటకు వచ్చిరి. కాని వారికి ప్రయాణఖర్చులకుగూడ తగినంత ద్రవ్యము లేకపోవుట, యింతలో కార్సికాలో విప్లవమాగిపోవుట విని యతడు తిరిగి మార్సేల్సు చేరెను. అతడు మార్సేల్సులోనే కొంతమంది యువకులను జేరదీసి తనయుద్దేశ్యముల నాచరణలోనికి బెట్టనారంభించెను. ఒక చిన్నగది; కొద్దిమంది యువకులు; పరికరములు—సాహసము, దేశభక్తి, ఆత్మవిశ్వాసము; ఉద్యమము—ఇటలీసంతను విప్లవాగ్నితో ముంచివేయుట; "మాకొక ఆఫీసు లేదు; మాకు సహాయులు గాని, స్నేహితులుగాని ఆయుధసామగ్రిగాని యేమియు లేవు" అని యతడు వ్రాసెను.

క్రియాసిద్ధిః సత్త్వే
మహతాన్నోపకరణే.

మహాత్ముల కుపకరణము లక్కరలేదు; ఆడంబరము లవసరము లేదు; ఆత్మశక్తియే, యిచ్ఛాశక్తియే వారి కార్య



సిద్ధికి 'మూలవిరాట్' అనుసామెత మేజినీపట్ల వర్తించెను. "అహర్నిశములు మేము కార్యనిమగ్నులమై యుంటిమి. వ్యాసములను వ్రాయుట, ఉత్తరములను వ్రాయుట, సముద్రయానములను చేయువారిద్వారా వర్తమానములను తెలిసికొనుచుండుట, నావికులను బ్రోత్సహించుచు మాసంఘములో జేర్చుకొనుచుండుట, కరపత్రములను మడతపెట్టుచుండుట, కవరుల నతికించుచుండుట, చరిత్రలను పఠించుచుండుట, గృహకృత్యములను తదితరపనులను స్వయముగా మేమే చేసికొనుచుండుట; యీవిధముగా నూపిరి సలుపకుండనుండువారము. మాలో నొకడు అచ్చుకూర్చువాడు; మరియొకడు ప్రూఫులు దిద్దుచుండెడివాడు; పత్రికలను పంచిపెట్టుటకు డబ్బులేక మాలో నొకడు స్వయముగా నాపనిచేసెడివాడు. మేము సోదరులవలె సమానసహోదాలోనే నివసించెడివారము. మాకందఱకు నొక్కటే యాలోచన; ఒక్కటే యాశయము; ఒక్కటే యాదర్శము. ఇతరదేశప్రజాస్వామికవాదులు మా యవిరళకార్యకలాపమునకును, నిరంతరపరిశ్రమకును, నకుంఠితదీక్షకును మమ్మెంతయో ప్రేమించి స్తుతించుచుండెడివారు. మేమెప్పుడును ద్రవ్యలోపముచే బాధపడుచుండెడివారము. కాని మేమెప్పుడును సంతోషముతోనే యుండెడివారము. మాప్రాంతములలో శాంతియే తాండవమాడుచుండెడిది. ఇటలీయొక్క భావిసౌభాగ్యము మాక

న్నులకు గట్టినట్లు కాన్పించుచుండెడిది. ఆమహానందమే మాకు హాలాహలము నమృతప్రాయముగ చేసెను; దవానలమును చందనద్రవ్యముగ నొనర్చెను" ఇట్టిమిత్రబృందము రెండుసంవత్సరములు మార్సెల్సులోనే పనిచేయుచు విప్లవకరణములను దేశమంతటను వెదజల్లుచుండెను.

దేశముకానిదేశములో ద్రవ్యము లేక, సాధనసామగ్రిలేక కొద్దిమందియువకు లొకగొప్పసామ్రాజ్యముతో యుద్ధమునకు దలపడుట చూచువారల కాశ్చర్యము గొలుప వచ్చును; వారిచేష్టలు పిచ్చిచేష్టలవలె దోపవచ్చును. కాని దానిని నడిపించునాయకునివిశ్వాసముముందర మహాసామ్రాజ్యములుగూడ 'హనుమంతునిముందర కుప్పిగంతులని' యతని యనుచరులును పరిగంచనునుగూడ గ్రహించెను. వారట్లు దినములు, వారములు, నెలలు నిరంతరపరిశ్రమలో నిమగ్నులై 'అభినవయిటలీ' సంఘములను యిటలీయంతటను స్థాపించుచు, నభిమానకోటిని పెంపొందించుచు విప్లవాగ్ని నంతకంతకు ప్రజ్వలింపజేయుచుండిరి. ఇటలీలో వీరిసంఖ్య హెచ్చుకాజొచ్చెను. పాఠశాలలలోను, పల్లెటూళ్ళలోను, పట్టణములలోను పటములు, కరపత్రములు, పంచాంగములు మొదలగునన్నిమార్గములద్వారా పోలీసువారియనుమానములకు తావీయకుండులాగున ప్రచారము గావింపబడెను. మేజినీ తనయనుచరుల నిట్లాజ్ఞాపించెను. "పర్వతాగ్రముల



నధిరోహింపుడు! వ్యవసాయదారులకళ్ళములకు పొండు! వర్తకుని దుకాణములమీద కూర్చొనుడు! చేతిపనులుచేయుచు జీవించుపారిశ్రామికులకర్మాగారములను పూర్తిగా గాలించుడు! వారికి వారిహక్కులనుగురించి బోధించుడు! వారి పూర్వవైభవములను యశశ్చంద్రికలను జ్ఞాపకము చేయుడు! నాశనముగావింపబడిన వారివర్తకవైభవోన్నతులను కళ్ళకుకట్టినట్లు చూపించుడు. ఎన్నివిధముల ప్రభుత్వమువారు వారి నణగద్రొక్కుచున్నారో వర్ణించిచెప్పుడు. మన మెవరమును వారికట్లు యథార్థమును చిత్రింపకపోవుటచేతనే వా రుదాసీనత వహించి యూరకుండిరి." అతని పిలుపు నంగీకరించి యనేకవేలమందియువకులు తీవ్రప్రచారమును సాగించిరి. ఈవిప్లవకారులను పెట్టినబాధలు, కష్టములు, దేశాంతరవాసశిక్షలు, యురికంబములు మొదలగు వానిని వర్ణింపనలవిలేదు. కాని వారెన్నినిర్బంధములనైనను "మాబాధలు, మానిర్బంధములు, మావిచారములు మొదలగున వన్నియు నడుగడుగునకు మాపవిత్రాశయములకు, మాపరమావధికి మార్గములే యగుచున్నవి." అను విశ్వాసములో ననుభవించుచుండిరి.

"నూనూగు మీసములవారము మే మయిదుగురము మాత్రమే యుంటిమి; మాకు ద్రవ్యసంపత్తి యంతకుమును

పేలేదు. కాని మేమొక మహాసామ్రాజ్యమును కూలద్రోయుటకు నియోగింపబడినారము. మా నిరంతరకృషియొక్క ఫలితమును మేమెవరమును చూడజాలమనియే నా జోస్యము. కాని, మేము వెదజల్లిన విప్లవకణములు మా యనంతరము జాజ్వల్యమానముగా విజృంభింపగలవు. మాశ్రమ మప్పుడు సఫలీకృతము కాగలదు." అని రూఫినీసోదరులలో నొకడు చెప్పెను.

దీనికితోడు 'అభినవయిటలీ' యనుపత్రిక బ్రహ్మాండమైన ప్రచారమును గావించెను. ప్రభుత్వమువారిచే నిషేధింపబడినసాహిత్యమంతయు నిటలీ కనేకమార్గములద్వారా పంపబడెను. జినీవా, లెగ్హారను, పైడ్మాంటు మొదలగు ననేక ప్రదేశములకు పీమరాళ్ళమధ్యను, తారుపీపాలలోను, బట్టలు, గిల్టుకాగితములు మొదలగువానిబేళ్ళలోను యితరపేకేజీలమధ్యను పెట్టి పంపుచుండెడివారు. ఈవిధముగా మార్సేల్సునుండి పంపబడుసాహిత్యమేగాక యిటలీలోగూడ ననేకచోట్ల రహస్యముగా నచ్చుఆఫీసులు స్థాపింపబడెను. ఫలితము మేజినీ యనుకొనినదానికంటె గూడ నెక్కువగ గోచరమయ్యెను. దేశమంతటను రహస్యసంఘములు వలయల్లుకొనిన ట్లల్లుకొనిపోయెను. న్యాయవాదులు, ప్రభుత్వోద్యోగులు, పారిశ్రామికులు, నావికులు, కులీనులు, సామాన్యులు, మతబోధకులు, వీరువారననేల 'నేలయీనినట్లు' తండో



పతండములుగా విప్లవకారులసంఖ్య దినదినాభివృద్ధి నొందెను. వెనుకటికార్బనరీసంఘములలో సభ్యులైనవారందఱును దీనిలో సహజముగా జేరుచుండిరి. ఇట్లు యేబది యరువది వేలమంది రెండుమూడువత్సరములలో జేరిరి. ఈకాలమందే గారిబాల్డీమార్సేల్సు వచ్చి మేజినీని కలుసుకొని విప్లవోద్యమములో జేరెను.

పైడ్మాంటు, జినీవాలు మేజినీయొక్క యుద్యమమునకు రంగస్థలములయ్యెను. ఇతరసంస్థానములు సహాయము చేసినను చేయకపోయినను పైడ్మాంటుయొక్క సహాయమున్న చాలుననియు, నది యుద్ధకళలో నిదివఱలో నారితేరియున్నదనియు, లొంబార్డీ మొదలగుప్రదేశములపై కురుకుట కిక్కడనుండియే ప్రయత్నించవలెననియు నతడు గ్రహించెను. జినీవా, పైడ్మాంటులలో ప్రజాస్వామికవాదులును జాతీయవాదులును తరుణముకొఱకు వేచియుండిరి. సెవాయిలో గూడ విప్లవాగ్ని బాగుగాకలదు. ఫ్రాన్సులోనున్న విప్లవాభిమానులకిది చాలసమీపముననున్నది. మేజినీ మార్సేల్సుచేరిన కొద్దినెలలకు పైడ్మాంటుకు రాజైన ఛార్లెసుఆల్బర్టు కిట్లొకయుత్తరము వ్రాసెను. "ఆర్యా! మీకనంతకీర్తిని, యమృతత్వమును, నిజనత్వమును, బ్రసాదించునట్టిమార్గము మరియొకటికలదు; ఆస్ట్రియా, ఫ్రాన్సులకన్న ననేకరెట్లు బలసంపత్కరము క్షేమంకరము నైనమిత్రము మరియొకటిగలదు. పైడ్మాం

టుకిరీటముకన్న వేయిరెట్లు దేదీప్యమానమును, యుత్కృష్టమును నగు కిరీటము వేరొకటికలదు. దానినిగురించి యోజించినవారిని దానికొఱకు సమస్తమును, ప్రాణములనుగూడ నర్పించిన వారిని, నిరంకుశమాలిన్యముచే దానియశఃకాంతులను మలినముజేయ నొల్లనివారి నది తనంతదానే వరించును. ఆర్యా! ఇరువదిశతాబ్దము లమోఘమైనయశఃకాంతులతో తేజరిల్లిన యిటలీ! మహామేధావులను గాంచగలిగినయిటలీ! శత్రుదుర్భేద్యముగు పర్వతపంక్తులతో పెట్టనికోటవలె మనలను కాపాడశక్తి గల యిటలీ! నిగురుగప్పిన నిప్పువలె నిగూఢమైన యనంతశక్తి సంపదలను సేకరించుకొని సమయముకొఱకు వేచియున్న యిటలీ! సమస్తసస్యసంపదలచేతను, ప్రకృతిసౌభాగ్యముచేతను కలకలలాడుచున్న యిటలీ! పరప్రభుత్వదాస్యమునుండి విడిపించుటకు కొద్దిమంది శూరశిఖామణులకొఱకు యెదురుచూచుచున్న యిటలీ! మనదేశమాత! ఆమెపై మీవీక్షణ మెపుడును బ్రసరింపలేదా? మీ రీజాతియోద్యమమున కధిష్టానదేవతగనుండుడు! సంఘీభావము, స్వేచ్ఛ, స్వాతంత్ర్యము, అను స్వర్ణాక్షరములు మీధ్వజము నలంకరింపనిండు; దుర్మార్గులనుండి యిటలీని విడిపింపుడు; భావిసౌభాగ్యకర్తలుకండు; ఇటాలియనుల మోక్షమునకు నపోలియనులై వర్ధిల్లుడు; మీ రెట్లు చేసెదరా మేమందఱమును మీధ్వజముక్రిందకు వత్తుము; మాప్రాణ



మాన, ధనములను సర్వస్వమును మీ కర్పింతుము. ఇటలీలోనున్న చిన్నచిన్న సంస్థానముల నన్నిటిని మీయండకే చేర్చెదము. మీక్షేమ మెప్పుడును కత్తిపైననే యాధారపడియున్నది. ఒరనూడబెరికి పారవేయుడు! కత్తి ఝళిపించుడు! కాని మీ రిట్లు చేయకుండుచో నితరులు మీరు లేకుండగనే, మీమీదగూడ నిట్లు చేసితీరెదరు!"

చార్లెసు పిరికివాడు; చంచలచిత్తుడు. అతడాస్ట్రియాకు భయపడెను. ఈయుత్తరము ప్రచురమగుటతోడనే మేజినీ స్వదేశములోని కడుగుపెట్టు నెడల నిర్బంధింపవలెనని పోలీసువారు విచ్చుకత్తులతో గాచుకొని యుండిరి. తనప్రయత్నము విఫలమైనను మేజినీ ద్విగుణీకృతోత్సాహముతో యుద్ధసన్నాహములను సాగించుచు పైడ్మాంటులోని సైన్యశిబిరములలోనే విప్లవమును లేవదీయు ప్రయత్నములను గావించెను. సైన్యములో కులీనులు, చదువుకొనినవారు, ప్రజాస్వామికవాసనగలవారు చాలమందిగలరు. వారందఱు నీసంఘములో జేరి విప్లవముకొఱకు యెదురుచూచుచుండిరి. విప్లవము 1833 లో జరుగవలసియుండెను. కాని విప్లవకారులు చాలయాలస్యము చేయుటచే కుట్రబయటబడెను. ఈసందర్భములో ఛార్లెసు వహించినకాఠిన్యమును, దయాదాక్షిణ్యరాహిత్యమును, చరిత్ర మరువజాలదు. విప్లవకారు లనేకమంది యురితీయబడిరి. అనేకమందిని నేరము నొప్పుకొనుమని చిత్రవధల పాల్జేసిరి.

ద్వీపాంతరవాసశిక్షలు, విడఖయిదులు మొదలగునవి విచ్చలవిడిగా విధింపబడెను.

కుట్రదారులమర్మములను తెలిపినచో విడిచెదమనియు, లేనిచో నురితీసెదమనియు రూఫినీసోదరులలో నొకనిని బాధించిరి. అతడు వెంటనే యాత్మహత్య గావించుకొనెను. విప్లవకారులరక్తముతో ఛార్లెసుకార్యవర్గములోనున్న నిరంకుశప్రభుత్వతృష్ణాదాహము తీర్చబడెను. ఈరుధిరస్రావముతో నిటలీలో మరియొకయుగ మేర్పడెను. “శూరశిఖామణులై దేశముకొఱకు ప్రాణముల నర్పించువీరులరక్తవర్షముచే పోషింపబడి భావములు సద్యఃఫలితము నొందగలవు” అని మేజినీ నుడివెను. ఈదారుణచర్యలే యిటలీయువకులను గాఢనిద్రనుండి మేల్కొల్పి వారిని స్వాతంత్ర్యసమరసన్నాహదక్షులను గావించెను.

ఇది యటుండ ఫ్రాన్సులోనే మేజినీ నిర్బంధములకు గురియయ్యెను. ఫ్రెంచిప్రభుత్వమువా రతనిని దేశమునుండి వెడలగొట్టనుత్తరువిచ్చిరి. అతని యచ్చుఆఫీసును నిర్మూలము చేసిరి. మేజినీ యీరెండుశిక్షలనుండియు తప్పించుకొని ఫ్రాన్సులోనే యొకచోట దాగియుండి ఫ్రెంచిదేశపుఅచ్చుపనివాళ్లనే పెట్టుకొని తనయుద్యమమును సాగించుచుండెను. సంవత్సరములో రెండుసార్లుమాత్రమే యతడర్ధరాత్రులందు స్త్రీవేషమును ధరించి బయటకువచ్చునట! ఈసమయమందే



ఫ్రెంచిప్రభుత్వమువారు మేజినీపై కూనీచేయించె ననునొక యసత్యపునేరమును తీసికొనివచ్చిరి. తరువాత నిది బూటకమని రుజువయ్యెను.

మేజినీ 1833 సంవత్సరము జూలైనెలలో జినీవాకు వచ్చెను. మరియొకనూతనవిప్లవమును లేవదీయుటకే యతడచ్చటకు స్వయముగా వచ్చెను. ఒక్కొక్కయపజయ మతనికి మరింతదృఢవిశ్వాసమును గలిగించుచుండెను. యూరపు అంతయుగూడ ఘోషించిపోయినచార్లెసుయొక్క యత్యాచారముల కతనిని శిక్షింపవలెనని మేజినీ దీక్షబూనెను. ఎట్టిసంకటములైనను, యెంతటినిరంకుశాగ్నియైనను తనకావంతయు భీతిలేదను ‘నీతిని’ తనపక్షమువారికి గూడ చూపవలెననియు, విప్లవాగ్ని నెన్నడును చల్లారనీయకూడదనియు నొక్కసారి చల్లారినచో దానిని మరల రగుల్కొల్పుట కష్టసాధ్యమనియు నతడు గ్రహించెను. యూరపు నగమువఱకు విప్లవపూరితమైయున్నదనియు, నిటలీలో ప్రజాస్వామికోద్యమమును లేవదీసినచో నియగ్ని జ్వాలాతోరణమువలె, లంకాదహనమువలె, యూరపునంతను ముట్టించుననియు నతడూహించెను. జినీవా, సెవాయి, పోపుయొక్కరాష్ట్రములు, నేపిల్సు మొదలగుప్రదేశములలో విప్లవకణములు రగులుచునే యున్నవి.

1833 వ సంవత్సరాంతములోపల స్విడ్జరులండులో ననేకవేలమంది దేశాంతరవాసము ననుభవించుయువకులు జేరిరి. ఇందులో జర్మనులు, పోలులు, ఫ్రెంచియువకులు గూడ నుండిరి. మేజనీ వీరిద్వారా అభినవయూరపుసంఘమును లేవదీసి దీని నొకమహాసముస్యగా జేయసంకల్పించెను. చాలమంది యుద్యోగస్థు లతనికి సహాయపడిరి. ఈసైన్యమును నడుపుటకు రేమరీనోయను నొకసేనాపతి నియమింపబడెను. ఇతడు నెపోలియనుసైన్యములో పనిచేసి చాలయనుభవమును గడించెను. మేజనీ 800 మంది సైన్యముతో సిద్ధముగా నుండెను. గారిబాల్డీ పైడ్మాంటులో బ్రయత్నములు జేయుచుండెను. కాని చివరకు రేమరీ ద్రోహియయ్యెను. మేజనీ కష్టించి సంపాదించినధనమునంతను యతడు తగులబెట్టెను. ఇంతేకాక ఫ్రెంచిప్రభుత్వమునుంచి డబ్బుతీసికొని దీనిని భగ్నమొనర్పసమకట్టెను. విదేశప్రభుత్వములన్నియు నీకుట్రదారులను బెదరగొట్టవలసినదిగ స్విడ్జరులండుప్రభుత్వము నొత్తిడిచేసిరి. చివరకు రేమరీనో యేయుద్ధమును చేయకుండగనే విప్లవసైన్యమును భర్తరపుచేసెను.

---

## స్విడ్జరులండు.

ఇట్టిపరిస్థితులలో మేజనీ కారోగ్యము చెడిపోయెను. నిరంతరకృషి, అహోరాత్రము లొక్కటకునుకైనను లేకపోవు



ట, కార్యసాఫల్యము కాకపోవుటచే గలుగు మనోజిజ్ఞాస, స్విడ్జరులండులో నుండరాదను నిషేధము మొదలగు నిర్బాధపరంపర లెట్టివానినైనను సృక్కడగించును. ఈయన్నిటికంటెను స్విడ్జరులండును వీడుటెట్లు? యనునదే పెద్ద ప్రశ్న. స్విడ్జరులండు యిటలీకి సమీపములోనున్నది. అతడక్కడ నుండితీరవలెను. మూడువత్సరములనుండి యతడొకచోట నుండిమరియొకచోటకు దరుమగొట్టబడుచు లాసేను, బెర్ని, సొలేరు, ౘీన్, గ్రెన్ఛను మొదలగు స్థలములలో తలదాచుకొనుచు నింటిలోనుండిపైకిరాకుండ ఖయిదీవలెనే కాలము గడుపుచుండెను. ఒకసారి యేసుమానము లేకధాటి నొకప్రదేశమునుండి యొకప్రదేశమునకు తరుమగొట్టబడి శిధిలమైన యిండ్లలో దాగొనుచు, కిటికీలకు చాపలుకట్టుకొని రాత్రులందుమాత్రమే పర్వతములగుండ పరుగులెత్తుచు నతడు పడరానియిడుమల నొందెను. అతని స్నేహితులందఱును చెల్లాచెదరైపోయిరి. ప్రాణమిత్రులు కొందఱు ప్రాణములను గోల్పోయిరి. అతనిమూలమున ననేక కుటుంబములు సమూలముగా నాశనమైపోయెను. తండ్రిలు బిడ్డలకును, భార్యలు భర్తలకును, నక్కచెల్లెండ్రు సోదరులకును, దూరమైపోయిరి. అను బాధయే యతనిహృదయమును మరింత వేధింపసాగెను. ఏకాకియై జీవించుట బహుకష్టముగానుండెను. “నా జీవితమంతయు నన్నొకకొట్టులో బెట్టినను నాకు కావలసినన్ని

పుస్తకములు లేక చిత్తారయున్నచో చాలును" అని యతడనెను. అతని యారోగ్య మస్తమాన మొక్కచోటనే కూర్చొనవలసివచ్చుటచే చెడిపోయెను. తల్లి యెన్నిమందులను పంపించినను నతడు వాని నుపయోగించలేదు. పైగా ద్రవ్యలోపమొకటి యతనిని బాధించుచుండెను. తల్లి కొంతద్రవ్యమును పంపుచుండెడిది. స్నేహితులు స్వల్పద్రవ్యమును పంపుచుండెడివారు. కాని తనవలెనే బాధపడువా రతని నడిగిన నపు డతడు వారికి కావలసిన దిచ్చివేయుచు దిరిగి రిక్తహస్తుడగుచుండెను. ఇదిగాక 'అభినవయిటలీ' సంస్థకు, ప్రచురణలకు, తపాలఖర్చులకు చాలధనము కావలసియుండెను. అతడు ప్రాణావసరములను దప్ప తక్కినవాని నన్నిటిని విసర్జించెను. అతనికి చినిగిగుడ్డలు తప్ప వేరుబట్టలు లేవు. తల్లికావలసినవస్తువులను పంపుచుండెడిది. మాతృదేవతయైన యిటలీని చూడవలెనని గూడ యతడు తపించుచుండెడివాడు. జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ ?

"మీరు నా హృదయకవాటమును కోసి చూడుడు! 'ఇటలీ' యను స్వర్ణాక్షరత్రయ మచట చిత్రింపబడియుండుట మీరు చూడగలరు" అని యతడొకసారి తన యనుచరులతో చెప్పెనట. అతడొకసారి యొకస్నేహితురాలి కిట్లు వ్రాసెను: "దూరముగానున్న ఆల్ప్సుపర్వతముల వైపుకు నాదృష్టి నొకసారి ప్రసరించితిని. వాని వెనుకనే



దీనవదనయైన నాయనుంగుదేశమాత! నాయిటలీ యున్నది. నాతల్లిదండ్రులు కన్నులు చిల్లులపడునట్లు నారాకకెదురుచూచుచు తపించుచున్నారు. నాయిద్దరు సోదరీమణులును నాకొఱకు ముఖము వాచియున్నారు! మరియొక సోదరీమణి స్వర్గస్థురాలై నన్నాశీర్వదించుచున్నది. నాప్రాణతుల్యుడు, నాకుడిభుజము, దేశముకొఱకు ప్రాణముల నర్పించిన రూఫినీయొక్క సమాధి యచ్చటనేయున్నది. రత్నకంబళములను బోలు పచ్చికబయళ్ళు, రజితకాంతులనీను కాసారములు, పర్వతసానువులు, స్వర్ణహ్రదములు, నానావిధపుష్పరాజములు, ఆరామములు, వనశ్రేణులు, వినీలవినిర్మలాకాశము, యివియన్నియు నేల నిర్విచారముగా మాతృదేశపాదారవిందములకడ నసువుల నతిసంతోషముతో నర్పించుటకు గావలసిన సమస్తము నచ్చటనే కలదు. దానిని తలచుకొనినపుడు నామనసు క్షోభించుచుండును."

కాని యీయన్నిటికంటె నతనిని గొడ్డలివ్రేటువలె బాధించునది గతప్రయత్నములు విఫలమగుటచే దనపక్షములోనే గలిగినయవినీతి. ఇటలీనుండి నిరుత్సాహము, నిస్సహాయము, సూచించువార్తలే వచ్చుచుండెను. అందఱును తనను విడిచిపెట్టినట్లుండెను. అతనిపై ననేకనిందలు మోపబడెను. ఇటాలియనులమూకీభావముగూడ నొక్కొకపు డతనిని బాధించుచుండెడిది. "ఆహా! ఈయిటాలియను లెంత యుదాసీనులైయున్నారు! తమవిముఖత్వమునకు వీరు కారణ

ములకొఱకు వెతుకుకొనుచుంట వింతగానున్నది. వారు పేరుప్రతిష్ఠలులేక, యుచ్చనీచములులేక, దైవోపహతులగుచు, స్వాతంత్ర్యజాతులలో నప్పులపాలగుచు, తుచ్ఛమైన కేవల భానిసజీవితములను జీవించుచున్నారమని చూడజాలకున్నారు" అతని ప్రోత్సాహమువలన నగ్నిహోత్రగుండములో దూకినవారికొఱకతడు మరింత వ్యధనొందుచుండెను. నే నొవ్వడును కళ్యాణమునే చేయగోరితిని; కాని యదేమిపాపమోగాని నావలన ప్రతివానికిని హానియేజరిగెను. ఈభావము నాలో నభివృద్ధియగుచు జివరకు నాకు పిచ్చియెత్తునట్లున్నది. నాప్రాణతుల్యులే నన్ను ద్వేషించుచున్నారని నే నొక్కొక్కపుడు తలచుచుందును. నే నేమిచేసితిని? అను విషయమునకూడ నా కప్పు డప్పుడు సందేహము కలుగుచుండును. నేను యుదయము మొదలు సాయంకాలమువఱకును, యిటలీని గుఱించియే చింతించుచుందును. నాభగవంతునిమ్రోల నిలచి నేను కుట్రదారునైనందుకు క్షమింపగోరుచుందును. నే నట్లగుటకుగల కారణములలోగాని, నాయాత్మవిశ్వాసములలోగాని గోరంతయు మార్పుగాని, పొరబాటులుగాని లేవు. విశ్వాసము లచంచలములు; అవియే నామతము. నావంటి విశ్వాసములుకలవాడు తా నొక్కడే యాత్మార్పణమును చేసికొనవలసినసమయము లున్నవనిమాత్రము నేను గ్రహించవలసినది. నే నందఱకు యజ్ఞవాటికపై నర్పించివేసితిని.



అతని నొకవిధమైనవిచార మావహించెను. ఆలుబిడ్డలతోను, నన్నదమ్ములతోను, సకలైశ్వర్యములతోను, ప్రశాంతముగా కాలముగడుపువారిని తన యభిప్రాయములకొఱ కేలవృధాత్యాగము చేయవలెను? చివరకు తన యభిప్రాయము లన్నియు గగనకుసుమములువంటివే యగునేమో యను సందేహములు రేయింబవళ్ళతనికి బొడగట్టుచుండెను. అతనికొఱకు విచారించుతల్లులు, సోదరులు భార్యలు మొదలగువా రతనికి గాన్పించుచుండిరి. ఇట్టి సంశయములనుండి యతనిమనసు తిరుగ 'ధర్మము ధర్మము' అను మాటలచే దిటవునొందుచుండెను. ధర్మమే యతనిజీవితవేదాంతము. ఈమానవధర్మములను గుఱించి యత డొకపుస్తకమునుగూడ వ్రాసెను. సంశయమంతయు దానితో నశించి శరీరకష్టము, యుపద్రవములు, నిందలు, దైవము తప్పనితరబంధువులుకాని, స్నేహితులుకాని యుండనట్టి యేకాకిజీవితము మొదలగువానినే యతడు వరించెను. "ధర్మమే నాప్రభువు; నాస్వామి. అది యెట్టియాకర్షణమును నొసంగజాలని మతము; అది నాకష్టములను, విచారమును నావంతయేనియు తీసివేయదు. కాని యదొక్కటే నాజీవిక; న న్నాత్మహత్యనుండి తప్పించు నమృతఘుటిక" అని యతడు నుడివెను. అతడొకసారి తన స్నేహితుని కిట్లు వ్రాసెను. "మానవు డొక్కసారి మనోవాక్కాయకర్మభిః స్వేచ్ఛ! దేశము! మానవలోకము! యను పద

త్రయమును విశ్వసించునేని యతడు నిశ్చయముగా నపజయములను, నిందాద్వేషములను, పరాభవములను, మరెన్నిసంకటములనైన నెదుర్కొనుచు, సర్వకాలసర్వావస్థలయందును, చేజిక్కినసర్వాయుధములచేతను నామరణాంతము పోరుసలుపుచు నవసరమైనచో వీరశయ్య నలంకరింపవలెను. స్వధర్మనిర్వహణమే జీవితపరమావధి."

ఈకాలములో నతడు వ్రాసినవ్రాతలుకూడ చాల యుత్కృష్టమైనవి. అతనియాత్మవిశ్వాస మెప్పుడును చెక్కుచెదరలేదు. "నాయీజీవితమునకు భవిష్యత్తుకలదని నే నెఱుందును. నా కది కాన్పింపకపోయినను విచారములేదు. ప్రజలయొక్క ధర్మసంగ్రామమునే మనము మనధర్మముగా జేపట్టితిమి. ఐచ్ఛికముగానే మన మొకదేశముయొక్క దుస్సహదుఃఖభారమును మీదవేసికొంటిమి. మన మాపరాత్పరుని దివ్యతేజమునుండి యొకకణమును సంగ్రహించి ప్రజలకును నతనికిని మధ్యస్థులముగా నుంటిమి. మోక్షసంధానకర్తృత్వమును మనము మనమీద పెట్టుకొంటిమి; మనల నాతడను గ్రహించి యాశీర్వదించెను." అతని స్నేహితులు, తల్లిదండ్రులు, బంధుగులు పరిచయులు మొదలగువా రందఱు నతనిని తన యుద్యమమును విరమించుకొని ప్రశాంతజీవితమును గడుపుమని కోరిరి. కాని యతనికి స్వధర్మనిర్వహణమునందే పరమశాంతి ప్రాప్తించుచుండెను. అతడు మానుచో నీకార్య



మును నిర్వహించువా రెవరు నతనికి గాన్పించలేదు. వాక్ప్రబోధనము, పత్రికానిర్బంధము సాహిత్యనిర్బంధము మొదలగు నిరంకుశచర్యలకు లోనైనదేశములో యథేచ్ఛగా వ్రాసికొనుచు మనోగతాభిప్రాయములను వెలిబుచ్చుచు శాంతచిత్తులగుటకు తా వెక్కడకలదు? ఎన్నినిర్బంధములు, యెన్నియుపద్రవములు, యెన్నిసంకటములు ప్రాప్తించినను బ్రాప్తించుగాక! నాసంకల్పశక్తి నవి యడంపజాలవనియే యిపుడు చూపవలసియున్నది. నా కెట్టిసహాయమున్నను లేకున్నను కాచువలేను. ఇతరులునన్ననుసరించుటలేదని నేను చేతులు ముడుచుకొని కూర్చొనజాలను." అని నిశ్చయించుకొని గతనాలుగైదేండ్లనుండియు బయలుదేరినవిప్లవములు విఫలములగుటకు గారణముల నతడారయుచుండెను. వానివెనుక నాధ్యాత్మికశక్తి లేకుండుటయే దీనికి గారణమని యతడు గ్రహించెను.

ఫ్రెంచివిప్లవము, ప్రజలస్వార్థమును, స్వప్రయోజనమును మాత్రమే యాదర్శముగా గొనెను. హక్కులు, సౌఖ్యాభిలాష, భోగములు వీటికొఱకే పోరాడవలయుననునదే దానిసందేశము; అది దుర్మార్గము నణచుటకుమాత్రమే బయలుదేరెను; కాని యది కళ్యాణము నన్వేషించు మతము కాకపోయెను. స్వేచ్ఛ, మానవసౌభ్రాతృత్వము యను సిద్ధాంతము లందుగోనున్నవి. కాని యవి సిద్ధాంతములే కాని

యాచరణరహితములైనవి. కనుక నాధ్యాత్మికదృష్టి యవసరము. "మే మొక కేవలరాజకీయకక్షకు చెంది పతితులమైతిమి; ఇపుడు తిరుగ నాధ్యాత్మికపతాకంబులపై మే మొక నూతన ధ్వజము నెత్తవలెను." దానికి ధర్మమే జీవకర్త్రి, ధర్మనిర్వాహణమే ప్రతిమానవుని పరమావధియై యున్నది. దానిని నీవు నిర్వహించుచుంటివా యని ప్రశ్నించుకొనుము! నీవు నీకొఱకే పనిచేసికొనరాదు. మానవకళ్యాణముకొఱకే నీవు పనిచేయవలెను.

'తేత్వఘం భుఞ్జతే పాపా
యే పచన్త్యాత్మ కారణాత్.

అతనికింకను విప్లవమునందును, యిటలీయందును, విశ్వాసము పోలేదు. యూరపుకూడ నీవిప్లవమునకు తగియున్నదనియు, యిటలీయే దీనిని ప్రారంభించుటకు తగినదనియు యతనియాత్మవిశ్వాసము. తనమహాదాశయములతో నిటలీలో నూతనశంఖారావమును బూరించవచ్చునని యతని యాశయము. దేశమింతయు తయారుగా లేనపుడు విప్లవమును లేవదీయుట కార్యసాధనము కాదనియు, దానివలన నెందఱో దేశభక్తు లనేకకష్టములపాలై నిరుత్సాహు లగుదురనియు, యుద్యమమునకే భంగము వాటిల్లుననియు నతనిస్నేహితులందఱు నతనికి నచ్చజెప్పిరి. ఇటలీలో స్వతంత్రముగా విప్లవప్రయత్నము బయలుదేరనిదే తానట్లు పైనుండి తెచ్చిపెట్టు



నని యతడు వాగ్దానముచేసినను విప్లవమే ప్రజల నుద్రేకపరచు మార్గమని యతడు విశ్వసించెను. మొదటిప్రయత్నములు విఫలములైననేమి? అవి ప్రజలలో నుత్సాహశక్తిని రగుల్కొల్పుచు చివరకు జయముప్రాప్తించును. శతాబ్దములనుండి పాతుకపోయిననిరంకుశవిధానముచే జడత్వమునొందిన ప్రజ లధమపక్ష మొకటి రెండు పురుషాంతరములవఱకు నిద్రమత్తునుండి లేవజాలకుందురు. ఒకసారి వేడి యందుకొనినచో దహనసంస్కారము జరుగుచునే యుండును. త్యాగము, ప్రయత్నము, కృషి యెన్నటికిని వృథాగా నేరవనియు, చేతులుముడుచుకొని రొట్టలు వేయుచు గూర్చుండుట పిరికితనమనియు నతనివిశ్వాసము.

1834 వ వత్సరము జూలై నెలలో 'అభినవయిటలీ'యొక్క ఆఱవసంచిక ప్రచురమయ్యెను. ఇదియే దీని చివరసంచిక.

ఇది యింతటితో సాగిపోయినను మేజినీ యుత్తరప్రత్యుత్తరములను, యేజెంటులను, బంపుచు విప్లవాభిమానులను రగుల్కొల్పుచునే యుండెను.

అతడు స్విడ్జరులండురాజకీయములలోని లోపములను గూడ కనిపెట్టి వానిని సంస్కరింపనుద్యమించెను.

అతడిటలీలోవలెనే యిచ్చటకూడ యువకులను ప్రోత్సహించి 'అభినవస్విడ్జరులండు' అను నొకసంఘమును స్థాపించి ఫ్రెంచి, జర్మను భాషలలో ద్వైవారపత్రికలను స్థాపిం

చెను. ఈపత్రికకూడ సంవత్సరములోపలనే యణచివేయబడెను. మేజనీ స్విడ్జరులండులో నెన్నటికిని యుండరాదని శాసింపబడెను. పైవిధముగా నతడు స్విడ్జరులండునుగూడ నగ్నిహోత్రమును వెలిగించెను. అతనియాశయము లచ్చట నెఱవేఱెను 1848 వ సంవత్సరములో స్విడ్జరులండుదేశమున మేజినీసూచించిన సంస్కరణములే చట్టములుగా నామోదింపబడెను.

మేజినీయొక్క యుత్సాహశక్తి యిటలీ, స్విడ్జరులండులతో మాత్రమే తృప్తిపొందునది కాదు. సెవాయిప్రయత్నము విఫలమైన రెండుమాసములలో పదిహేడుగురు యిటలీ, జర్మను, పోలుదేశముల యువకులుగలసి 'అభినవయూరపుసంధి' అను నొకపత్రమును సంతకముచేసిన ట్లిదివఱకే వినియుంటిమి. మేజినీసూత్రములప్రకారము ప్రజాస్వామికపద్ధతులపైననే యీ మూడుదేశములును కలియవలెనని యంగీకరింపబడెను. దీనివలన గొప్పఫలితము కలుగకపోయినను యూరపుఖండమంతట నొకవిధమైనప్రచారము జరుగునని యు, యేజంట్లు మొదలగువివిధమార్గములద్వారా జాతీయోద్యమములను బలపర్చవచ్చునని యు, ఫ్రాన్సునుండి యిటలీబాధను తొలగించుట కిదియొకసాధనము కావచ్చునని యు నత డూహించెను. మొత్తముమీద నిదిప్రపంచదృష్టిలో కొంతపలుకుబడిని సంపాదించి ప్రజాస్వామికప్రభుత్వము



లకు జాతీయప్రయోజనము లేగాకుండ నంతర్జాతీయప్రయోజనముకూడ గలదని సూచించెను. ఇది నిజముగా సామాన్యవిషయము కాజాలదు.

ఈకాలములోనే మేజినీ రాజకీయప్రచారముతోపాటు పుస్తకములనుగూడ వ్రాయుచు దానివలన నుదరపోషణమునకును, రాజకీయప్రచారమునకును, తగినద్రవ్యమును సంపాదించుకొనవలెనని యోజించెను. ఇంతేకాక యిటలీలో నున్నచార్వాకమతమును (Scepticism) పారద్రోలవలెనని యతనియభిప్రాయము. స్నేహితు లనేకమంది రాజకీయములను విరమించి కలముతో దేశమునకు గౌరవకీర్తులను సంపాదింపవలసినదని యతనిని కోరిరి. "నన్ను క్షమింపుడు! ఇది నా కర్తముగాదు. ఇప్పు డిటలీ యేదియో యది యెచ్చట నున్నదో నాకు గోచరము కాకున్నది! మనము దానిని పునరుద్ధరించవలెను; సృష్టించవలెను; తరువాత దానిగౌరవమర్యాదలను నిలబెట్టవలెను;" అని యతడు ప్రత్యుత్తర మిచ్చెను అయినను నతడు తన సామర్థ్యమును చూపించుపుస్తకము లనేకములను వ్రాసి నూతనయుగకారకు డయ్యెను. అత డొకదివ్యసందేశమును ప్రపంచమున వ్యాపింపచేయ గల్గెను. స్త్రీలనుగుఱించి యతని కుత్కృష్టాశయములుండెడివి. వారిని గౌరవించవలెను; ప్రేమించవలెను; నీసౌఖ్యముకొఱకే నీ వామెను ప్రేమించరాదు. నీబుద్ధిబలమును, నైతికశక్తిని,

ప్రబోధప్రజ్ఞానములను ద్విగుణీకృతము చేయుశక్తి యామెకో కలదు. ఆధిక్యతను నీమనస్సునుండి పారద్రోలుము; నీ కట్టి యాధిక్యతయేమియును లేదు. స్త్రీపురుషులలో నీచాధిక్యతలు లేవు. ఇద్దరుపురుషులమధ్య సామాన్యముగా నుండునట్టి ప్రత్యేకవృత్తులును, వివిధరుచులును మాత్రము యిచ్చటను గాన్పించును. స్త్రీపురుషులు మానవలోకమునకు నేత్రద్వయమువంటివారు. వివాహము చాల పవిత్రమైనది. మన జీవితధర్మమును సాధించుటలో నదియొక మహోత్కృష్టమైన సాధనము; అది ప్రేమఘనోద్భవమైననొక యమానుషశక్తి; త్యాగము నానందమయముగా నొనర్చు యనంత మనోల్లాసము; పుష్పాగ్రమును దహించుదారుణ పరితాపమును చల్లార్చు హిమబిందువు "కాని యీరోజులలో మనము యథార్థప్రేమను చూపుటలేదు. భగవద్దత్తమైన మహాపవిత్రవస్తువు ప్రేమాస్పదమగుటకు బదులు తుచ్ఛశరీరసౌఖ్యముల కొఱకు కాంక్షింపబడుచున్నది. గృహము లేక కుటుంబము, సాంఘికధర్మములను, మర్యాదలను విడనాడినది. స్త్రీత్వపురుషత్వమర్యాదలు నశించి మగ, ఆడ శబ్దములే మిగిలినవి." అని యతడెప్పుడును వగచుచుండెడివాడు. అతడెప్పుడును నిరంతరకార్యనిమగ్నుడై యుండుటచే ప్రేమపాశములకు జిక్కలేదు. కుటుంబసౌఖ్యములకు మరగి ప్రజాకార్యములను విస్మరించువాడు నిర్భాగ్యుడు. అనేకమందిస్త్రీలతనిని భ



క్తితో పూజించుచుండిరి. అతడు వారిని "ప్రాణమిత్రుల" వలెనే భావించుచుండెను. అతని తల్లియెడల నతనికపారమైన ప్రేమయుండెడిది. అతని ప్రాణమిత్రులగు రూఫినిసోదరుల తల్లికూడ నతనికి మరియొకతల్లివలెనేయుండెడిది. అతడామెను తల్లివలె ప్రేమించెడివాడు.

అతడెవ్వరిని వివాహమాడలేదు. కాని యతనివలెనే దేశభక్తిగలిగి దేశాంతర్గతుడైన యొకసోదరికిని యతనికిని పరస్పరానురాగము కుదిరెను. కాని త్వరలో వారొకరినొకరు విడిచి దేశాంతరములలో జీవించవలసివచ్చెను. మరియొకకన్య మేజనీని వరించి యతనికొఱకు తపించుచుండెను. అతడామెపట్ల కృతజ్ఞతను జూపి 'యీమహాప్రసాదమును స్వీకరింపజాలను' అని యూరకుండెను. ఇంతలో నతడు లండనునకు పోవలసివచ్చెను. ఆకన్య యతనికొఱకు దహించుచు నిరంతరజ్వరపీడితురాలై యుండగా ననేకమందిస్నేహితు లతని నెట్లైన నాస్త్రీని రక్షింపవలసినదని కోరిరి. కాని యతడొకస్నేహితునకిట్లు వ్రాసెను. "నేను దీనికెట్లు సమ్మతింపగలను? నేను స్వతంత్రుడనని మీయభిప్రాయమా? కన్నులకగుపడు ప్రేమపాశములను, సంబంధములను మాత్రమే గుర్తించు మనుష్యులకును, సంఘమునకును నేనట్లే యగపడుదును. కాని వాగ్దానములకు సాక్షిభూతముగా జూచుచుండు నాభగవంతునిముందర, నాహృదయసాక్షిముందర నేను పా

పినగుదును." తనను ప్రేమింపకుండునట్లు తనలోనున్న లోప
ములనామెకు జూపవలసినదనియు నతడామె నెప్పుడును
సోదరీప్రేమతో భావించుచుందుననియు నతడు స్నేహితులకు
కబురుపంపెను. ఇట్లు మేజినీ మొదట తాను ప్రేమించినస్త్రీ
కపచారమును జేయనొల్లక నామె యెచ్చటనున్నను, యే
లోకమునన్నను తన హృదయము చలింపజాలదని తనయే
కపత్నీవ్రతమునే పాటించెను. వీరిరువురును పరస్పరము ప్రే
మించుకొనిరేగాని వివాహముకూడజరుగకుండగనే విడిపోయి
రి. మేజినీ యామె కుత్తరములను వ్రాయుచు దన ప్రేమను
వెల్లడించుచునే యుండెను. వారీలోకములో మరొకటిరెండు
సారులు కలుసుకొనినను వృద్ధాప్యములో స్నేహితులవలె, సో
దరీ సోదరులవలెనే కలుసుకొనిరి.

---

## లండను.

స్విడ్జరులండులో నుండరాదనునాంతుచే మేజనీ
రూఫినీసోదరులతో ఫ్రిస్సగుండ లండను చేరెను. అ
చ్చట వారయిదుగురు చేరి జార్జివీధిలో నొకయింట మూడు
వత్సరములవఱకు ననేకకష్టముల నొందుచు నివసించుచుం
డిరి. వారిలో నిద్దరుమాత్రమే యింగ్లీషుభాష మాట్లాడగ
లరు. మేజినీ వారిలో "సౌమ్యవర్తనము, యుత్సాహశక్తి గలి
గి కరుణాసముద్రునివలె" నుండెడివాడు. అత డితరులసౌఖ్య



ముకొఱకును, రుమలకొఱకును తనకున్న సర్వస్వమును ధార
పోసెడివాడు. కానితన యాదర్శములలోమాత్ర మత డితరు
లకు లొంగువాడుకాడు. తనతోడిస్నేహితుల కతనికున్న
దృష్టి లేకుండెను. అగస్టినో యను నాతడు స్వార్థపరుడు;
గయ్యాళి. ఇట్టివారితో నొక్కకపు డతడు వేగలేక కన్నీటి
ధారలను గార్చుచుండెడివాడు. ఆతని కారోజులలో మరెక్క
డనుండియు సహాయము లేకపోయెను. ఇంటిలో లేనిపోనిపో
రాటము లేవియో నతని మనశ్శాంతిని చెడగొట్టుచుండెడివి.
చదువుకొనుట కతనివద్ద పుస్తకములు లేవు. కొనుటకు
ద్రవ్యము లేదు. అతనివలె,దరిద్రము ననుభవించుచు దేశాంత
రములనుండి వచ్చినవారు తప్ప మరెవరు నతనికి బరిచయు
లు లేరు. క్రొత్తదేశీయులమధ్య నింగ్లండులో నతడేకాకిగానుం
డెను.అక్కడ డబ్బులేనివానికి స్థానము లేదు, అట్టివాడు విశ్వా
సపాత్రుడు కాడు. అతడతిదరిద్రావస్థలో నుండుటచే దరుచు
బంగాళాదుంపలనుగాని వరియన్నమునుగాని తినుచుండెడి
వాడు. వర్తకము చేసికొనుమని యతనితండ్రి కొంతధనము
ను పంపించెను. పాప మతని కందులో దండుగవచ్చెను. దా
నికై తండ్రి కఠినముగా నుత్తరములను వ్రాసినని యతడప్పు
టినుండి పైసయైనయింటివద్దనుండి తీసికొన నిరాకరించెను. ఇత
రయుద్యోగములకొఱకెంతవెతకిన నతనికేమియు దొరకలే
దు. పుస్తకములవలనను వ్యాసములవలనను కొద్దిగా ధన

ము ప్రాప్తించెడిది. అది యింటిఖర్చుకే చాలకుండెడిది. దే హాయని యడిగినవాని కతఁడు లేదని యెఱుఁగఁడు. "మానవసౌభ్రాతృత్వమను వేషముతో నతనియింట దేశాంతరవాసము ననుభవించుచున్నవారందఱును వింగుల నారగించుచున్నట్లు భావించెడివారు." అని యగస్టినో గొణుగుచుండెడివాఁడు. మేజినీ క్రమముగా తనసర్వస్వమును తాకట్టుపెట్ట నారంభించెను. తన పుస్తకములు, పటములు, గడియారము దుస్తులు, చివరకు తనతల్లి యుంగరము మొదలగునవన్నియు స్నేహితుల కొఱకు ఖర్చుపెట్టబడెను. ఒకశనివారమురోజున తిండిలేక నాలిక్రోళ్ళను, వేస్టుకోటును తాకట్టుపెట్టి యతఁడు మఱునాఁడు తిండి తినెను. మరియొకరోజున చలికోటునమ్ముకొని చలిబాధచే రోగగ్రస్తుఁడయ్యెను. మంచిదుస్తులను బంపుచో వాని నమ్మివేసి తనస్నేహితులకు క్రొత్తసూట్లుకొని యిచ్చుచున్నాఁడని యతనితల్లి సాదాగుడ్డలనే కుట్టి పంపుచుండెడిది. ఒక్కొకపుడు కట్టుకొనుటకు మంచిదుస్తులు లేక నతఁడు యింటిలోనే యుండిపోవుచుండెడివాఁడు. అతనికి గావలసినపుడు స్నేహితులు ధనము బదులిచ్చెడివారు. అతఁడు దాని నితరులకిచ్చివేయుచుండెడివాఁడు. వార్తాపత్రికలను తనఖాపెట్టి యతఁడు కొంతపైకమును దేవలె ననుకొనెను. కాని యట్లు డబ్బిచ్చువారెవరును లేకపోయిరి. పారిసునుండి స్నేహితులు కొంతపైకమును బంపిరి. అతనికొఱకు చందాలను



పోగుచేయుట కతఁడిచ్చగింపలేదు. "నాతల్లి యీపలుకులను వినుచో నిట్టి యవమానమును భరింపజాలక చనిపోవును" అని యతఁడు నుడివెను. ఆత్మహత్య; లేదా ఋణదాతల నాశ్రయించుట యను నీరెండుమార్గములే యతనికి గాన్పించెను. ఆత్మహత్య ధీరలక్షణము గాదని యతఁడు నూటికి ముప్పది, నలువది, చివరకు నూటికి నూఱు చొప్పున గూడ వడ్డికి తెచ్చెడివాఁడు.

"ఈయిణదాతలు కడుగర్భదరిద్రునుండియైన నాఖరి రక్తపుచుక్కవఱకు పిండుదురు; ఒక్కొకపు డతని యాత్మగౌరవమును గూడ నాశముచేసి విడిచిపెట్టుదురు." అని యతఁడు విలపించెను. కాని కొన్నిరోజులకే మేఘములు చెల్లాచెదరు కాజొచ్చెను. 1840 వత్సరములో మేజినీ తన పాతయింటిని విడిచి కార్లైలు కవికుటుంబముండు చోటుకు మారెను. రూఫినీసోదరు లిద్దరు నతనిని విడిచి వెడలిపోయిరి. దానితో నింటిలోని పోరడగెను. లండను దిమ్మ నీలపొగయంతయు బోయి ప్రకృతిసౌందర్యము నతఁ డాస్వాదింపగలిగెను. థేమ్సునదీప్రవాహతోయములు వానిపై తేలియాడు చిత్రవిచిత్ర నావాగణములు, పచ్చనిమైదానములు, వృక్షచ్ఛాయలు మొదలగునవి యతని దుఃఖోపశాంతికి గొంతతోడయ్యెను. కాని మొత్తముమీఁద నీకాల మతనికి దుష్కాలముగానే కాన్పించెను. "మానవుఁ డవుడు యేకాకి

గా జీవింపజాలడు. నాకేమి కావలెనో, నేనేమి యోజించుచుంటినో తెలిసికొన కుతూహలపడువాఁ డొక్కఁడును నాకు గాన్పించలేదు." అది యతనికి "నీతిభ్రంశమైన యుగము; అవిశ్వాసముతో గూడిన యుగము; జీససును చంపిననాటి యుగమువంటి యుగము" వలె గాన్పించెను. ప్రయత్నములన్నియు నిష్ఫలములయ్యె ననుబాధ యతనికి మరింత శూలమయ్యెను. స్నేహితులను దుఃఖసముద్రములో ముంచివేయుటకే దష్టవిధి యతనిని నియమించెననియు, దానాహుతియైనను ప్రజల నింకను సౌఖ్యపెట్టజాలకపోతిననియు నతడు వాపోవుచుండెడివాడు. కాని యతడు నిరాశపొందలేదు. స్విడ్జరులందులోని విషమపరిస్థితు లతనికి గుణపాఠ మయ్యెను. సౌఖ్యములకొరకు చూచుకొనుట స్వార్థమునకు మార్గము. దేశభక్తులకు సౌఖ్యములు కలలోనివార్తలు. "త్యాగమే యదార్థమైన సుకృతము. భగవంతుడు, దేశము, మానవలోకము మొదలగు సమస్తచరాచరములపట్ల ధర్మము నాచరించుటే యథార్థపురుషుని జీవితధర్మము. పరమార్థము.

"ఈజీవిత మొక మజిలీస్థానము. ఇచ్చోట నాత్మ పవిత్రతను బొంది మరియొక యుత్కృష్టమజిలీ చేరవలెను. అక్కడ స్నేహితులందరును గలసికొనెదరు. వారివిచారములును, మనస్పర్ధలును లయమగును. ప్రేమయే సమస్తమును బరిపాలించుచుండును. ఈప్రపంచములో గూడ వ్యక్తులకు



సంబంధించినంతవరకు విచారమే ప్రాప్తించినను మానవలోకము, మానవకళ్యాణము మాత్ర మెప్పుడు నభివృద్ధిగాంచుచునే యుండును. నూతనజ్ఞానము, నూతనాశయములు, యుదారజీవితసిద్ధాంతములు మొలకలెత్తుచుండును." ఇట్టిభావము లతని కెప్పటికప్పుడు సంతోషమును గూర్చుచుండెను.

ఇంతలో నొకటిరెండువత్సరములలో నిగ్లండులో సకవిశేఖరులందఱు నతనికి స్నేహితులు కాజొచ్చిరి. కార్లైలుసోదరులు వారిలో ముఖ్యులు. మేజినీ "శూరుడు; మహామేధావి; ఉదారహృదయుడు; విశ్వాసయోగ్యుడు." అని కార్లైలు నుడివెను. ఒకసారి పైడ్మాంటుమంత్రి మేజినీనిగుఱించి తేలికగా మాట్లాడెను. వెంటనే కార్లైలు రోషముతో నిట్లు బలికెను. "అయ్యా! తమకు మేజినీనిగురించి రవ్వంతయు దెలియదు. అతనిగుణముల నీమన్మాత్రమును మీ రెరుగరు." మరియొకపుడు కార్లైలు టైమ్సుపత్రికకిట్లు వ్రాసెను. "అతనియొక్క ప్రపంచిక వ్యవహారకౌశలమును గురించియు, కార్యాచరణలోని మెళుకువలను గురించియు నాకెట్టి యభిప్రాయములున్నను నేను యథేచ్ఛగా ముక్తకంఠముతో మానవలోకమున కిట్లు చాటగలను. నేనిట్టివానిని చూడలేదు. ఇతడు మహామేధావి; సుగుణరాశి; సత్యసంధుడు; ఉదారమనస్కుడు; దయార్ద్రహృదయుడు; ఇట్టివారీప్రపంచములో కోటికొక్కరుమాత్రమైనను దుర్లభమగుట ప్రపంచ

దౌర్భాగ్యము తప్ప వేరొండు కాదు. ఇట్టివారే యాత్మయజ్ఞ మొనర్చిన ధీరోదారులు; వీరు తమనిత్యజీవితములో రెండవకంటివాడెరుగకుండ, నిరాడంబరముగా నతిపవిత్రభావముతో త్యాగముయొక్క యంతరార్థమును గుర్తించి యాచరించుచుండు యజ్ఞదత్తులు." ఆషర్టుసోదరులు, విలియంషేను, జాన్‌స్టువర్టుమిల్లు మొదలగు మహామేధావంతు లందరును క్రమముగా నతనికి స్నేహితులైరి. వీరిలో ఫ్రాన్సుదేశపు కవిశేఖరుడైన లేమినేరుయొక్క వ్రాతలు మేజినీవ్రాతలకు గొంతవర కాధారము లయ్యెను. "ఈశుభోదర్కమగుమూర్తిని జూచి యెవరు ప్రేమింపకుండ నుండగలరు?" అని యత డొకసారి మేజినీని గురించి పలికెనట!

స్నేహితులతో గాలక్షేపము చేయుటే కాక మేజినీ తన కార్యకలాపమునుగూడ మరువకుండెను. అతడు పత్రికల ననేకవ్యాసములను వ్రాయజొచ్చెను. ఈకాలములోనే యతడు 'మానవధర్మములు' అను మహోత్కృష్టగ్రంథమును రచించెను. ఇంతేకాక ననేకయుత్కృష్టవిమర్శనములు, నవలలు, జీవితములు మొదలగునవి వ్రాయబడెను. కాని యతడు వీనితో దృప్తిపొందడాయెను.

ఇటలీరాజకీయములు పూర్తిగా నధోగతిపాలయ్యెను. 'అభినవయిటలీ' కార్యక్రమమంతయు సన్నగిలినట్లుండెను. అతడు రాజకీయములలో తిరిగి ప్రవేశింపకున్న నావంతయు



బలి జరుగునట్లు కాన్పించలేదు. నాయకత్వమును వహించి ముందుకు వచ్చువాడెవడును కాన్పించలేదు. పైసంఘసభ్యులందరును వెనుకంజవేసినట్లుండెను. చాలమంది యిటలీప్రభుత్వముతో రాజీకుదుర్చుకొనిరి. కొంతమంది తమ విశ్వాసములను పెదవిమెదల్పకుండ బోషించుకొనుచుండిరి. వెనుకటి జవసత్త్వములతోను, యుత్సాహముతోను పనిచేయువారరుదైరి. కుట్రప్రయత్నములు చావకపోయినను పూర్వపు కార్బనరిరహస్యసంఘముల సాంప్రదాయములను బట్టి యెవరికివారు వివిధతెన్నులను బట్టి సంఘీభావము లేకయుండిరి.

దేశాంతరములలో నివసించుచున్నవారిసంగతికూడ నిట్లే యుండెను. "ఏయొక్కవిషయమందుగాని యేకాభిప్రాయులై యేకముఖమునకువచ్చినవారు మాలో నేయిద్దరును గూడ లేకయుండిరి. మాలో యదార్థమైన 'అభినవయిటాలియను' ఒక్కడును గూడ లేకుండెను. మేజినీ తనసిద్ధాంతముల నెంతమాత్రమును రాజీచేయువాడు కాడు. ఆదర్శములకొరకు పోరలేక మొదటిరంగములోనే వెన్నుజూపువారి నీతడు క్షమింపజాలడు. ఇట్టిస్థితిలో నతడొక్కసారి యిటలీకి పోయి యిటాలియనులను స్తబ్ధత్వమునుండి మేల్కొలుపవలెనని చూచెను. తనధర్మమును, తనవిధిని నెరవేర్చుకొనకుండ చనిపోవలసివచ్చునని యతడు భయపడుచుండెను. "ఆహా! యీనిర్భాగ్య, నిరుపయోగ, శుష్కజీవితభారము నన్నుం

గా కృంగదీయుచున్నది. దైవసాక్షిగా, యిటలీసాక్షిగా, నా హృదయసాక్షిగా నే నీకార్యమునకు బూనుకొంటిని. నే నిందు లో నుపేక్ష వహించుచో నాత్మవంచకుడను, దైవవంచకుడను, దేశద్రోహిని యగుదును. నాస్నేహితుడు జాకపో జీవించియున్నాడని నే నెరుగుదును. ఈనూతనవిశ్వాసమునకు మే మిరువురము నగ్రగాములమైతిమి. దీనిఫలితమును మేము చూడజాలకపోవచ్చును. మా కట్టి కోరికేల యుండవలెను? కాని యీమహాగథమును, యీస్వాతంత్ర్యరథము నాపుట కెట్టిమానవశక్తికిని దరము కాదు." అని యతను దలపోయుచు 1839 వ వత్సరమున మరల ద్విగుణీకృతోత్సాహముతో కార్యరంగమున కురికెను. అంతకుమును పెన్నడును జరుగని పరిచారము నతడు కర్షకులలో జేయసమకట్టె. లండనులోనున్న యిటాలియనుదుకాణదారులను, వీధులలో సరకుల నమ్ముకొనువారిని, యితరవృత్తులవలన జీవించువారిని జేరదీసెను. వారికి సహాయము చేయుచుండుట, వారి నుద్బోధించుచుండుట, విద్యాబుద్ధులను గరపుట, వారిలోనున్న దుర్వ్యాసములను కనుగొని వానిని నిర్మూలించుట మొదలగు పనుల నతడు సాగింపజొచ్చెను. ఒకనాడొకస్త్రీ తిన తిండిలేక కట్టగుడ్డలేక నాకలి, చలిబాధలచే వణకుచు నొకరోడ్డుమీద దిక్కులేక సొమ్మసిలి పడియుండెను; మేజినీ యామెను రక్షించి, పోషించి విద్యాబుద్ధులను గరపి పెండ్లిపేరంటములు



చేసెను. చివర కామె భర్తృతిరస్కృతయైనపు డామె బిడ్డల కాతడే చిరకాలము ధనసహాయము చేసి విద్య చెప్పించెను.

ఇటలీనుండి లండను వచ్చి కొందరు దుండగులు 'తెల్లబానిసవర్తకము'ను సాగించిరి. పెద్దజీతమును, మంచిసౌఖ్యవంతమైన జీవితమును లభించు నను నాసగొలిపి యీదుండగులు ముందుగా నే కంట్రాక్టులను వ్రాయించి బీదరైతుబిడ్డల నచ్చటకు తీసికొనివచ్చెడివారు. వారి నచ్చట కొట్టుట, కడుపుమాడ్చుట, పీడించుట మొదలగుపనులు చేసెడివారు. మేజినీ వెంటనే యిట్టిదుండగులను న్యాయస్థానములలో శిక్షింపించి, వారియజమానులను భయపెట్టి దురాగతములను మాన్పించెను. అట్టిదిక్కులేని పిల్లలను మంచిత్రోవకు దేవలెనని యతడు వారికి రాత్రిపాఠశాల నొకటి స్థాపించి యిటలీచరిత్ర, భూగోళము, చిత్రలేఖనము మొదలగునవి బోధించెడివాడు. అతని కాపాఠశాలయం దమితప్రేమ. పిల్లలాతనిని "దేవునివలె పూజించుచుండెడివారు; తండ్రివలె ప్రేమించుచుండెడివారు." త్వరలోనే యీపాఠశాల యభివృద్ధిగాంచెను. ఈపాఠశాలను స్థాపించకముందే యితడు లండనులోనున్న యిటాలియనుకర్షకుల కొఱ కొకరాజకీయసంస్థను స్థాపించి యొకపత్రికను ప్రచురింప నారంభించెను. అందులో నతడు కర్షకులనే యుద్బోధించుచుండెను. విప్లవోద్యమ మొక్కయు కర్షకులపైననే యాధారపడవలెను. వారికళ్యా

కామే దానిపరమావధిగా నుండెను. భావియిటలీ 'ప్రజాయిటలీ' యని యతను బోధింపనారంభించెను. దేశభక్తులుకండు! ప్రజాస్వామికవాదులుం కండు! ప్రాచీనయిటలీయొక్క యశఃకీర్తులకు గర్వించుడు! మీబిడ్డలకొరకును, యిటలీభవిష్యత్తుకొరకును బాటుపడుడు. మీరేమిసంపాదింపగలిగిరి? అని భగవంతుడు మిమ్మెప్పుడును బ్రశ్నింపడు. మీతోడివారికి మీరేమి చేయగలిగితిరి? అనియే యతడడుగును. దానినిబట్టియే మనము పరీక్షింపబడుదుము." ఇట్టియుపదేశము లింగ్లండులోనున్న యిటలీకర్షకులనే గాక నిటలీలోని ప్రజాసామాన్యమునుగూడ గాఢనిద్రనుండి మేల్కొలుపుచుండ నిరంకుశప్రభువులు దద్దిరిలుచుండిరి; ఉలికిపడుచుండిరి.

---

## విప్లవము.

ఈవిధముగా మేజనీ కాలముకొరకెదురుచూచుచుండగా నిటలీలో మరల విప్లవప్రవాహము బయలుదేరెను. 'అభినవయిటలీ'లోని సభ్యులందరును నీవిప్లవములో మరల ప్రవేశించిరి. మేజనీ పత్రికల నతిరహస్యముగా పోలీసుకండ్లకు కనబడకుండ దాచుకొని పఠించుచుండిన విశ్వవిద్యాలయ విద్యార్థులును, కర్షకుల కుద్బోధించిన యుద్బోధములవలన కర్షకులును విప్లవములో చేతులను గలిపిరి. ఆస్ట్రియానిరంకుశత్వమంతరింపవలెను; దేశములో శుభప్రదమైన రాజ్య



స్థాపనకు తగు కట్టుదిట్టములు గావింపబడవలెను. అనియే విప్లవకారుల యాశయము. ఎన్నినిషేధములున్నను, యెంత పోలీసురాజ్యము ప్రబలినను గూడ సాహిత్యముద్వారా విప్లవ ముబుకుచునే యుండెను. నవలలు, నాటకములు, చరిత్రకారులు, గాయకులు, కవులు మొదలగువారు ప్రాచీన యిటలీయొక్క యశస్సును గానముచేయుచు నుద్బోధమును గలుగజేసిరి. సంఘసంస్కారవాదులు, విద్యాలయస్థాపకులు వ్యవసాయసంఘములు మొదలగు ననేకసంస్థలు స్వాతంత్ర్యకాంక్ష నుద్బోధించుచు విప్లవములో జేరిరి.

మేజనీ సమరసంరంభప్రయత్నములో నిమగ్నుడయ్యెను. పోపురాష్ట్రములలోను, యుత్తరదక్షిణయిటలీలలోను విప్లవములను లేవదీసి దేశాంతరములలో జీవించుచున్న వారి నందర నొకసైన్యముక్రింద జేర్చి యీవిప్లవకారులకు సహాయపడవలెనని యతడొకవ్యూహమును పన్నుచుండెను. వెనుకటివలెనే శత్రువుపై నకస్మాత్తుగా పడుచుండుట; కొండలలోను, నరణ్యములలోను దాగొనుచుండుట, తిరిగివిజృంభించుచుండుట యను యుద్ధపద్ధతియందే యతనికి విశ్వాసముండెను. అతడు కొంతసైన్యమును పోగుచేసెను. ఇద్దరు యువకులు, మహాధైర్యశాలులు మధ్యయిటలీలో పనిచేయుటకు నియమింపబడిరి వారికి ప్రాణములు తృణప్రాయములు. కాని పోలీసుయేజెంట్లు వారిప్రయత్నముల నన్నింటిని పరీ

షించుచుండిరి. వారొకపన్నుగడ పన్నిరి. కెలబ్రియాలో విప్లవము ప్రారంభము కానున్నదనియు, నచ్చటిసైన్యమునకు నాయకత్వమును వహించి యీయిరువురుయువకులును పని చేసినచో జయము నిశ్చయమనియు పోలీసువారే ప్రోత్సహించి వారిని పెడమార్గము త్రొక్కించిరి. స్వాతంత్ర్యము కొఱకు పోరాడువారికి తలదాచుకొనుటకు చోటిత్తుమని బీరములుకొట్టు బ్రిటిషుప్రభుత్వము మేజినీయొక్క యుత్తరప్రత్యుత్తరములను విప్పుచు నేపిల్సుప్రభుత్వమునకు సర్వమును వెల్లడిచేయుచుండెను. పాప మాయిరువురుయువకులును కొసెంజా చేరుటతోడనే తుపాకులతో గాల్చివేయబడిరి. ఇంగ్లీషుప్రభుత్వమువారిదుర్మార్గము బయటపడుటతోడనే మేజినీ యింగ్లీషురాజకీయములలోనికి దిగవలసివచ్చెను. అతని యుత్తరములను ప్రభుత్వమువారు విప్పిచూచుచున్నట్లు రుజువుచేయబడెను. మెకాలే మొదలగువారు ప్రభుత్వచర్యను పార్లమెంటులో గర్హించిరి. 'ప్రభుత్వము సామాన్యనీతినికూడ విడిచివేసి నిరంకుశప్రభువులప్రయోజనములకు దోహదమొనర్చుచు గూఢచారివృత్తిని స్వీకరించెను' కార్లైలు టైమ్సుపత్రిక కిట్లువ్రాసెను. "ఇంగ్లీషుపోష్టుఆఫీసులలో సీలుచేసినయుత్తరము లతిపవిత్రముగా భావింపబడునని మన మాశించుచుంటిమి. వ్యక్తులయుత్తరములను దొంగతనముగావిప్పి చూచుచుండుట జేబులను కత్తిరించుటవంటిది. అది యిం



తకంటెను దుర్మార్గమును, యుపద్రవకరమును నగు పోకిరీతనము; ఇట్టిపనిని యత్యంతోపద్రవసమయములందు దప్ప బూనరాదు." ఈతుపానను గప్పిపుచ్చుటకు ప్రభుత్వమువా రనేకబూటకములను బలికిరి. మేజినీ ఫ్రాన్సులో హత్యచేయించనని గ్రాహము బొంకెను; కాని తరువాత సత్యమును తెలిసికొని యతడు దాని నుపసంహరించుకొనెను. ఇది యింతటితో నాగక యీవిషయమును కనుగొనుటకు కామన్సుసభలోనుండియు, ప్రభువులసభలోనుండియు, రహస్యకమిటీల నేర్పరచిరి. ప్రభుత్వమువారు మేజినీయుత్తరములను విప్పించుటకు వారంటు నిచ్చినట్లు రుజువయ్యెను. కాని యంతకుమునుపే యతనియుత్తరములను విప్పుచు "విదేశప్రభుత్వమునకు" అందులోనున్నసంగతులను వ్రాసిపంపుచుండిరి. మేజినీ యీసమయమును బురస్కరించుకొని యిటలీయొక్క యాశయముల నింగ్లీషుప్రజలలో బ్రచారము చేయనారంభించెను. ఇంగ్లీషుప్రభుత్వవిదేశీయనీతి యనిన యతని కపరిమిత యసహ్యము, రోత కలిగెను. "అది యూరపురాజకీయవిషయములలో నేమాత్రము నూతనవిషయము వచ్చినను దానిని ప్రతిఘటించుచుండును; కాని యది తనకు లొంగని దైవమునకు జోహారు లొనర్చును." ఇతరదేశము లభ్యున్నతిజెందప్రయత్నించునపు డింగ్లండు వారికి దగునైతికప్రోత్సాహము (ఆయుధసహాయమవసరములేదని యతడు ఘంటాపథముగా జెప్పెను.) నిర్వ

వలెననియు, వానికృతజ్ఞతను సంపాదించుట యోగ్యమైన పని యనియు నతఁడు బోధించెను. ఇట్టిబోధలఫలితముగానే పామర్‌స్టన్ యిటలీకి సహాయపడెను.

మేజినీ యింగ్లీషు, అమెరికను ప్రయాణీకులద్వారా రహస్యపు టుత్తరములను, రాజకీయసాహిత్యమును యిటలీకి బంపుచుండెడివాఁడు. అతఁడు 1847 లో తన యింగ్లీషుస్నేహితురాండ్రను ప్రోత్సహించి యిటాలియనుబజారు నొకటి స్థాపించెను. దానివలన వచ్చుపైకమును తనరాజకీయప్రచారములకొఱకు 'జాతీయనిధి' యను పేరిట పోగుచేయవలె నని పైకి లండనులోనున్న రాత్రిపాఠశాలలకొఱ కనుమతికల్పించెను. ఆవత్సరములోనే యతఁడు 'అభినవయూరపు' సంఘమను పేరిట నిదివరలో స్థాపించినదానిపనిని సాగించుటకు ప్రజాజాత్యంతరసంఘమును స్థాపించెను. ఇటలీపట్ల సానుభూతి నిబడయుటే యతని ముఖ్యోద్దేశ్యము. ఈసంఘము వారము వారము సభలు జరుపుచుండెను. కూపరు, పీటరు, టైలరు, ఫాక్సు, విన్సెంటు మొదలగు ననేకమంది యింగ్లీషుస్నేహితు లందులో పాల్గొనుచుండిరి. "మీరు నిరంకుశప్రభుత్వముతో ధీరులై పోరి; విజయలక్ష్మిని జేపట్టిరి; మీ కిపుడు దాక్షిణ్య మవసరములేదు. నిరంకుశ పరప్రభుత్వదాస్యశృంఖలములచే గుందుచున్న మాదేశప్రజలకర్తవ్య మేమి? వారికి ప్రాతినిధ్యములేదు; వారికి లిఖితపూర్వకమైన హక్కులు లేవు; స్వేచ్ఛ



నొసంగిన పట్టాలుగాని, శాసనములుగాని లేవు. వారు యుద్ధము చేసితీరవలెను. అదియే గత్యంతరము" అని మేజినీ వారితో వాదించుచుండెడివాఁడు. అతఁడిట్లు చేతినిండ పనిగలిగి వెనుకటి విచారములను నిరాశను మఱచిపోయెను. అతని రాత్రిపాఠశాల, యిటాలియనుబజారు, యుత్తరప్రత్యుత్తరములు, సాహిత్యరచన, స్నేహితులనుజూచుచుండుట, స్నేహితు లతనిని చూడవచ్చుట మొదలగు దైనికచర్యలతో నిండి యుండెను. పోష్టుఆఫీసు వృత్తాంతముతో నతని కనేకమందిస్నేహితులైరి. కాని దారిద్ర్యము మాత్ర మతని విడిచిపెట్టలేదు. ఋణము పెరుగుచునే యుండెను. అడిగినవాడికి లేదనజాలఁడు. మునుపటివలె సాహిత్యరచనకు ధనమంతగా నిచ్చువారు లేరు; వ్రాయుటకు తగినంత సావకాశముగూడ నతనికి లేకుండెను. "8000 ఫ్రాంకులకొఱకు నేను బానిసను కావలసివచ్చెను. నాశరీరము నానాటికి వృద్ధాప్యమును బొందుచున్నది; నాశక్తి, నాబుద్ధి, నాయాత్మ క్షీణించిపోవుచున్నవి. నాదేశమునకు నాశక్తికొలది సహాయపడి నాధర్మమును నిర్వహించుటకు నాకవకాశములేకయున్నది." అని యతఁడు వాపోవుచుండెను.

ఇట్లుండ విప్లవము లొకటితరువాత నొకటి తలయెత్తెను. మొదట మిలానులో ప్రారంభమయ్యెను. తరువాత రెండురోజులలో లెఘ్హారనులో సాంఘికవిప్లవము నెమ్మదిగా

తలయెత్తెను. మేజినీయనుయాయియైన గెరాల్జి కొద్దిరోజులాపట్టణము కావిప్లవకాలములో యజమానియయ్యెను. మఱియొక పదిహేనురోజులలో సిసిలీబోర్బనుప్రభుత్వమును గూలద్రోసెను. నపిల్సురాజైన ఫెర్డినాండునుండి ప్రజలు స్వాతంత్ర్యమును పిండిరి. ఫిబ్రవరిలో టస్కనీ, పైడ్మాంటులు గూడ విముక్తినొందెను. మఱికొన్నిరోజులలో ఫ్రాన్సులో రెండవప్రజాస్వామిక పరిపాలన ప్రకటింపబడెను. పోపునుండి రోముకూడ విముక్తినొందెను. ఆస్ట్రియనురాష్ట్రములు దక్క యిటలీయంతయు నొక్కుమ్మడి స్వాతంత్ర్యమును బడసెను; ఇంతలో నీప్లవాగ్ని వెనీసు, బెర్గమో, బ్రెసియా, కోమో మొదలగుపట్టణముల నన్నిటిని ముట్టడించెను. కొద్దిరోజులయుద్ధముతో నవికూడ స్వాతంత్ర్యమును బడసెను. ఆస్ట్రియనుపాలన వారమురోజులలో నడుగంటెను. ఇటలీలో నొక్కయంగుళమైన నాస్ట్రియాకు లేకుండపోయెను. పట్టణములు, పల్లెలు, దిట్టలు, పల్లములు, అరణ్యములు, పర్వతములు, లోయలు, గుహలు మొదలగునవన్నియు విప్లవసైన్యములతో నిండిపోయెను. ఆకాశము విప్లవఘోషతో చిల్లులుపడుచుండెను. రాకుమారులు, రాజనీతికోవిదులు, ప్రభువులు, మతబోధకులు, విద్యార్థులు, పారిశ్రామికులు వీరు వారననేల 'బొబ్బిలిలోని చిళ్ళపెంకులవలె' యిటలీలోని మానవకోటియేగాక నీరంగములుగూడ దేశభక్తి



తో పొంగి, పొంగి పొరలజొచ్చెను. మేజినీయొక్క దివ్యాశయము:, 'కల', యదార్థమైనట్లు కాన్పించెను.

ఈసంతోషవార్తలను విని మేజినీ యిటలీకి బయలెత్తుకొనుచు పోయెను. ఇంతకుమునుపే యతడు పారిసుచేరి వివిధరాజకీయకక్షులకు జెదిన దేశాంతరవాసులను జేర్చి స్వాతంత్ర్యము, ఐక్యత యను రెంటికొరకు నందరు నేకముగావలెననువాశయముతో జాతీయసంఘ మను సంస్థను స్థాపించెను. అత డాల్ప్సుపర్వతములను దాటి యేప్రిలు యేడవ తేదీకి మిలను జేరెను. మిలనులో కోలాహల మతితీవ్రముగానుండెను. అదియొకవిప్లవకేంద్రమయ్యెను. రెండువేలమంది యిటాలియను లాస్ట్రియనుసేవను వీడి మూకతో జేరి "జై! యిటలీకి జై! విప్లవోద్యమమునకు జై!" అని కేకలిడుచుండినపు డతడు పులకితగాత్రుడగుచు పసిపిల్లవానివలె గంతులువేసెనట!" అతని కచ్చట జరిపిన సన్మానమత్యద్భుతము. పట్టణద్వారమువద్ద కనేకవేల పురజనులు వచ్చి యతనిని యుత్సవములతోను, యూరేగింపులతోను దోడ్కొనివచ్చిరి. అత డిదివర కరణ్యరోదనము గావించిన దిపుడు ప్రతిధ్వనినాలుకచివర నత్యుత్సాహముతో నుచ్చరింపబడుచు, గానముచేయబడుచు నాచరణయోగ్య మగుచుండెను. ఇతరులదృష్టిలో 'పిచ్చి, వెర్రి, మతభ్రమణము'గా దోచిన యతని విశ్వాసములన్నియు శుద్ధసత్యము లయ్యెను. ఇటలీ కొంచమించుమించు

స్వాతంత్ర్యమును బడసి యొక్కవేశి నిట్టూర్పును విడిచెను.
ప్రజాస్వామికతత్త్వము జయించుచున్నట్లు కాన్పించెను. తది
తర రాజకీయకక్షులవారందరును గూడ నైకమత్యముకొర
కే యుత్సాహమును జూపుచుండిరి. ఇతరు లందరును సంశ
యాత్ములై, విఫలమనోరథులై వెనుకంజవేసియుండ తనవి
శ్వాసముల నావంతయు వీడక వత్సరములకొలది తల్లిదండ్రు
లను, స్నేహితులను, బిన్నవారలను, ప్రాణతుల్యమైన యిట
లీని వీడి దేశాంతరములం దష్టకష్టముల పాలై క్రుస్సుచున్న
మేజినీని యిటలీ యథార్హముగా సన్మానించెను.

ఈకాలములో మిలనుపట్టణమున నతనిమాటయే శా
సన మయ్యెను. దేశమంతయు నతనికి బ్రహ్మరథము పట్టనా
రంభించిరి ఆరోజులలో మేజినీనామమును స్మరింపని వాడొ
క్కడును లేకుండెను. ప్రజల కదియే తారకమంత్ర మయ్యెను.
అతడు మకుటములేని చక్రవర్తియై యభినవయిటలీ హృద
యసీమల సింహాసనస్థుడయ్యెను. అతని నిరంతరత్యాగము,
తపస్సు నప్పట్టున సార్థకమయ్యెను.

---

### రోమును పాలించుట.

విప్లవకారులలోనే యనేక కక్షులున్నవనుసంగతి మన
మిదివరకే చూచియుంటిమి. యుద్ధసమయములో నీకక్షలేవి
యు దలయెత్తకూడదనియు, నైకమత్యమే ముఖ్యమనియు



నన్నికక్షులవారు నంగీకరించిరి. జయము సమకూరినతరువాత
రాజ్యవిధానమునుగురించి చర్చచేసికొన నంగీకరింపబడెను.
కాని యుద్ధము విజృంభించుచు, దినములు గడచినకొలది మి
తవాదులును, స్వార్థపరులును వాదములను పెంచసాగిరి. ఏ
పక్షమువా రాపక్షమును బురస్కరించుకొని యైకమత్యమును
యేకాశయమును భంగమొనర్చిరి. పోపు, నేపిల్సుదేశపు
రాజు మొదలగువారు తిరిగిపోయి ఆస్ట్రియాకు మద్దతుచేసి
రి. ఛార్లెసు యథాప్రకారముగా సంశయాత్ముడగుచు నె
నుకటి పిరికితనమునే గనపరచెను. అతడాస్ట్రియాకు భయ
పడి యిటలీని నడుపుభారమును నిరాకరించి ఆస్ట్రియాకే చే
యూత నిచ్చెను. ఇటాలియనులు ప్రతియుద్ధరంగమునోను
జయించుచునే వచ్చిరి. అయిన నేమిలాభము! నాయకుడు స
రియైనవాడు లేడు సైన్యము నానాటికి క్షీణించుచుండెను.
ఇట్టి విపరీతపరిస్థితులను గ్రహించి చివరకపజయమే నిశ్చయ
మని మేజినీ ముందుగానే సూచించెను. అటే విప్లవము విఫ
లమయ్యెను. విప్లవకారు లెంతధైర్యస్థైర్యములతో పోరాడిన
ను వారిసంఖ్య క్షీణించి, తగినంత యాహారపదార్థములేక
మిలనునకు దిరిగివచ్చిరి. ఒకసంరక్షకసంఘము నేర్పరచవలె
నని మేజినీ సలహాచెప్పెను. ఈసంఘ మేర్పడి మిలనుపట్టణ
మును గొంతకాలము కాపాడెను. ఎంతపోరాడినను శత్రుసే
న లసంఖ్యానీకముగానుండెను. విప్లవసైన్యము నానాటికి వ

లచ్చనైపోవుచుండెను. చివరకు లాభము లేకపోయెను. సైనికులు మిలనుపట్టణమును తిరిగికొనజూచిరి. కాని వారు వెనుకకు తరుమగొట్టబడిరి. మేజినీ యొకతుపాకి భుజముపైవేసికొని మిలనుపట్టణమును విడిచిపోయెను. గారిబాల్డిని కలుసుకొనవలెనని పోవుచున్నయొక స్వైచ్ఛికదళ మతనిని త్రోవలో గలుసుకొనెను. "భగవంతుడు- ప్రజలు" అను దివ్యాక్షరములు వారిధ్వజము నలంకరించెను. వారాధ్వజమును మేజినీ కిచ్చి 'నీవే దీనిని వహింపసమర్థుడవు' అని యతనిని కోరిరి. వారందరును చాలదూరము కలిసివెళ్లి సరిహద్దులను దాటిపోయి యెవరిమార్గమును వారు బట్టిరి. జయించుట దుర్ఘటమని వారికి తోచెను. అట్టిపరిస్థితులలో నాస్ట్రియనులే జయమొందిరి. కాని మధ్యయిటలీలో వారడుగు పెట్టజాలకుండిరి. వెనీసుపట్టణము వారి నెదిరించెను. మేజినీ యపజయము నొప్పుకొనువాడు కాడు. తనకార్యకలాపమునకు మధ్య యిటలీయే సరియైన ప్రదేశమని యతడు గ్రహించెను. రోము ఫ్లారెన్సులలో నతని కపారమైన పలుకుబడియుండెను. రోమునుండి పోపు పారిపోయెను. ఆరెండుస్థలము లందును ప్రజాస్వామికతత్త్వము జయించెను. కనుక నారెంటికి నైకమత్యమును గుదిర్చిరి. రిపబ్లికుప్రభుత్వమును స్థాపింపవచ్చునని యతడాలోచించుకొని లుగానోపట్టణమును వీడి మార్సెల్సుద్వారా ఫిబ్రవరియెనిమిదవతేదీని లెగ్హారను చేరెను. అది



నమునకే ఫ్లారెన్సుదేశప్రభువు పారిపోయెను. మేజినీ మరియొకవారమురోజులకు ఫ్లారెన్సు చేరెను. అచ్చట రాజకీయకక్షులలోనున్న విభేదములను పారద్రోలుట కతడు తన పలుకుబడిని వినియోగించెను. రోమనురాష్ట్రముల మధ్యనున్న విభేదములను మాన్పి యైక్యతను కుదర్చవలెనని యతడు ప్రయత్నించెను; కాని యతని ప్రయత్నములు విఫలమగుటచే నతడు రోమునకు పయనమయ్యెను. పోపు పారిపోయినప్పటినుండియు నతడు రోమనులను రిపబ్లికు స్థాపించవలసినదని హెచ్చరించుచునే యుండెను.

"మీరు మీచేతులలో నిటలీయొక్క భావిసౌభాగ్యమును గలిగియున్నారు. ఇటలీసౌభాగ్యమే ప్రపంచసౌభాగ్యము" అని యతడు వారిని హెచ్చరించెను. రోములో పోపుయొక్క రాజ్యాధిపత్య మంతరించవలెననియు నదిపూర్తిగా రిపబ్లికు (ప్రజాపరిపాలన) కావలెననియు క్రిస్టియనుమతము సంస్కరింపబడవలెననియు విశ్వమానవ సౌభ్రాతృత్వము మానవలక్ష్యమనియు నతడు చాటెను. "సామ్రాజ్యములను జాపచుట్టగాచుట్టిన రోమకసామ్రాజ్యము యూరపునంతను కత్తితో నైక్యము చేసెను. పోపుప్రభావముక్రింద నారోముపట్టణమే యాధ్యాత్మికాధికారప్రాబల్యముచే యూరపు నేకము చేసెను; ఇప్పుడు తిరుగ "ప్రజారోము" (Rome of the people) సాంఘికధర్మము, మానవలోకాభివృద్ధి యను నూ

తన సందేశముక్రింద యూరపు నేకము చేసి మైహికాముష్మికసమన్వయమును బడయవలయును" అని యతఁ డుద్ఘోషించెను.

మేజినీ లెగ్హారనులో నడుగిడుటతోడనే రోమను రిపబ్లికు (ప్రజాపరిపాలన) ప్రకటింపబడెను. మెజారిటీవచ్చిన ప్రతివానికిని వోటింగు అధికారముగల యెసెంబ్లీసభలో నందరును రిపబ్లికుకొరకే వోటిచ్చిరి. రిపబ్లికుయొక్క వ్యవహారములన్నియు "భగవంతుఁడు-ప్రజలు" అను సాంకేతికముతో నడుపబడుచుండెను. ఎసెంబ్లీయొక్క నాలుగవరోజున సభ్యులందరును కలసి మైక్యకంఠముతో మేజినీని రోముపట్టణవాసిగా గుర్తించి రోము కాహ్వానముచేసిరి. అతఁడు వెంటనే టస్కనీగుండ నెవరికిని తెలియకుండ మార్చి 5 వ తేదీని రోమునగరమును బ్రవేశించెను. రోమను పురద్వారములను దాటునపు డతనిశరీరము పులకరించెను.

నూతనజీవిత మావిర్భవించుచున్న ట్లతనికి దోచెను. అతనిసంశయములు, సందేహములు నిర్మూలమయ్యెను. రానున్న యుద్ధమునకు సమరసన్నాహములు గావించుట కితఁడు నిశ్చయించుకొనెను. పైడ్మాంటుశాంతిని భంగమొనర్ప నుత్సహించుచుండెను; లొంబార్డి, వెనీసు మొదలగుపట్టణములలో విప్లవసన్నాహములు చురుకుగా నుండెను. రిపబ్లికను రోముకూడ వెనుకాడరాదని యతఁడు వారిని హెచ్చరించుచుండెను. అతఁడు రోమను రిపబ్లికు కొకయధ్యక్షుఁడు (Trium vir) గా



నెన్నుకొనబడెను. అతనిమాటయే శాసనమయ్యెను. కొంచమించుమించుగా నతనినే సర్వాధికారిగా (Dictator) చేసిరి. చుట్టుప్రక్కల శత్రువర్గ మలముకొనియున్న ట్లతఁ డెరుగును. అతఁడు రోమనుసైన్యమును త్రిగుణ మొనర్చి యూస్ట్రియను సేనల మార్గము లన్నింటిని యరికట్టుటకు ప్రయత్నములు సలిపెను.

యుద్ధప్రయత్నములనే కాక నతఁడు తన మహదాశయములకు దగిన ప్రభుత్వవిధానమునుగూడ నిర్మించెను. "ఇక్కడ రోమునగరములో మనము నైతికభ్రష్టులము కాగూడదు." అని యతఁడు తోడిసభ్యులను హెచ్చరించెను. "మూలసిద్ధాంతములలో కాఠిన్యతయు, వ్యక్తులపట్ల సహనమును" చూపవలెనను తత్వము నతఁడు పరిపాలనలో నములుపెట్టెను తరువాత గలిగిన విషమపరిస్థితు లన్నిటిలోను నతఁడు దీని నేమరక కఠినముగా బాలించుచుండెను. అతనిపాలనములో జాతీయోపద్రవములు సంభవించినపుడుగూడ ముద్రణాలయములపై నెట్టినిర్బంధమును ప్రయోగింపబడలేదు. రాజకీయనేరములకు నిర్బంధములుగాని జుల్మానాలుగాని యేమాత్రము విధింపబడలేదు. కుట్రదారుల నెవరిని బాధింపక సహనము చూపబడెను. శత్రువులును, స్నేహితులును గూడ స్వేచ్ఛగా నెట్టినిరోధములను లేకుండ మనగలిగిరి. అందరకును సమానమైన రక్షణ ముండెడిది.

పోపుకాలములో జరిగిన నిరంకుశచర్యలవలన ప్రజ లుద్రేకపూరితులై కాథలికుమతముపై విముఖత్వమును చూపుటే కాక తమ బుద్ధి కాగములో నావంతయేని వారు పోపు కొసంగమనిరి. మేజినీ నూతనమతము కావలెనని ప్రోత్సహించుచున్నను, కాథలికుల నణచివేయుట యతనికి తృటికాలమే యైనను దానట్లు చేయక వారిని ప్రజాక్రోధమునుండి రక్షించెను. "మతబోధకులకు, వారియాధ్యాత్మికకృషికో మన మెప్పుడును సహాయముచేయవలెను. ఇటలీలో మతబోధకులు హానిచేయుటకు శక్తిలేనివారు; కాని మంచిచేయుటకు వారికితగిన సమర్థత కలదు" అని యతడు నుడువుచు జాతీయ కార్యములందు పాల్గొను డని వారిని హెచ్చరించెను. ఇంతేగాక నతడామతమునుగూడ చాలవరకు సంస్కరించెను. దానివలన నామతమునకు నూతనోత్తేజము కలిగెను. దానివలన ననేకమంది మతబోధకులు రిపబ్లికుకు సహాయపడిరి. ధర్మభూములను ప్రభుత్వమువారు తమ వశము జేసికొనిరి; ఆధనము మతమునుపదేశించు బీదకుటుంబముల కీయబడెను. మతసంబంధమైన యుత్సవములు, పూజాపురస్కారములు యథావిధిగా జరుపబడుచుండెను. అట్లు జరుపనందు కొకనికి శిక్షకూడ విధింపబడెను, "మతము పాడైపోకుండ రక్షింపవలసిన బాధ్యత ప్రభుత్వముపై గలదు." "మనదేశముకొరకును, మానవాభ్యుదయమును కోరు నుదారులకొరకును



భగవంతుని ప్రార్థింపుము" అని మేజినీ తనమతమును లాగికొందురని భయపడుచున్న యొకయోగినికి వ్రాసెను.

ఈవిధముగా రిపబ్లికుపరిపాలన యత్యంతసౌష్ఠవముగాను, శాంతముగాను జరుపబడెను. ప్రజ లత్యంత ముదావహులై తమసంతసమును వెలిబుచ్చుచుండిరి. మేజినీయొక్క విశ్వాసము వారికి జీవకర్రయయ్యెను; అతడు స్వార్థము నెన్నడును బ్రోత్సహింపలేదు. 'యథా రాజా తథా ప్రజా' యనుసామెత ననుసరించి దుష్టప్రభుత్వసంపర్కముచే నీతిచెడియున్నప్రజ లొక్కసారి యీదివ్యవ్యక్తిప్రభావముచే తమ దుర్బలత్వమును, దుర్నీతిని వీడి మహాదాశయములకొరకు ప్రాణముల నర్పింపసంసిద్ధులైరి. మహాదాశయముతోను, యుదారప్రభుత్వముతోను బవిత్రమైన రోము కొందరికి 'దేవతానగరము'వలె గాన్పించెను. వారు తమనాయకుని యథార్థముగా బూజింపసాగిరి. ఈకాలములో మేజినీ జీవించిన జీవిత మాదర్శప్రాయముగానుండెను. నిరాడంబరత్వమునకు దాని కదియేసాటి. అతడు క్విరినలు అనుచోట "సుఖముగా నుండుటకు దగినంత చిన్నగదిని" చూచుకొనెను. అతడందులో అంగరక్షకులు మొదలగు సిబ్బంది యేమియు లేకుండ శాంతముగా కూర్చొనును; అచ్చట నతడు తన యధికారవర్గములోనివారి నెట్లు గౌరవించి వ్యవహారములను చూచుకొనునో యట్లే పరిశ్రామికులను వారి స్త్రీలను గౌరవపురస్సరముగా

నాహారాదుముచేసి చిరునగవొలుకు ముఖారవిందముతో కరస్పందన మొనరించెడువాడు; అతడు రెండుఫ్రాంకులతో (1-3-6) భోజనము చేసెడివాడు; కొంతకాలమైనతరువాత రొట్టె, పండ్లు తినెడివాడు; పుష్పములే యతని విలాసవస్తువులు; సమస్త భోగములు; రాత్రులందు నొంటరిగా నున్నపుడు చితారును వాయించుకొనుచు నానందించుచుండెడివాడు. అతని యధ్యక్షజీతముక్రింద నిచ్చు ముప్పదిరెండుపౌనుల నెలజీతము పూర్తిగా నితరులకే ఖర్చుపెట్టుచుండెడివాడు. పరిపాలనానిర్వాహకత్వములో గూడ నతడు చాల దయార్ద్రహృదయుడై యుండెను. సైనికచట్టముప్రకార మురి విధింపబడినయొకసోల్జరు సందర్భములో నతడు మృత్యుశాసనముపై సంతకము జేయ నిరాకరించెను. నానావిధసంకటోపేతమగు ప్రభుత్వభారమును నిర్వహించుచున్నను యతడు శాంతిని వీడలేదు. స్థైర్యమును గోల్పోలేదు.

ఇట్లుండ నుపద్రవము మరియొకచోటనుండి తటస్థమయ్యెను. ఫ్రాన్సు యీసమయమున గావించిన నేరమును చరిత్ర మరువజాలదు. అది యాధునిక రాజకీయనేరములలో నతినికృష్టమైనది. "మరియొకప్రజలస్వేచ్ఛాభంగ మొనర్చుటకు మనసైన్యముల నెప్పుడును వినియోగించరాదు." అని ఫ్రాన్సు తా నొనర్చుకొనిన న్యాయమునకే వ్యతిరేకముగా తోడిరిపబ్లికయిన యిటలీని నాశముచేయుటకు సమకట్టెను.

దీనికి ప్రాయశ్చిత్తమును ఫ్రాన్సు సీడన్ రంగములో ననుభవించెను. మేజినీ వెంటనే రోమనులను యుద్ధమునకు హెచ్చరించెను. "అధర్మమైన, పశుబలమునకు మన మెన్నడును లొంగువారము కాము; రోము తనధర్మమును నెఱవేర్చవలెను; ప్రపంచవాసు లందరకును, నిటలీలోని ప్రతిభాగమునకును మన ముదారమైనయుదాహరణమును జూపవలెను." అని యెసంబ్లీలో నత డుపన్యసించెను. ఫ్రెంచిప్రభుత్వమే యతని శత్రువుకాని ఫ్రాన్సు కాదు. అచ్చట చాలమంది స్నేహితు లతనికి సహాయముచేయుచునే యుండిరి. ఒకసారి యిటాలియను సైన్యముచే ఫ్రెంచిసేనాని పూర్తిగా నోడింపబడి తరుమగొట్టబడెను. గారిబాల్డీ యాసైన్యమును రూపుమాపవలెనని పట్టుబట్టెను. మేజినీ దాని నంగీకరింపక ఫ్రెంచిఖయిదీల నుచితరీతిని సన్మానించి విడిచిపెట్టించెను; అనేకవేల సిగరెట్లు, రిపబ్లికు లన్నియు సోదరన్యాయమునే పాటింపవలెనను కరపత్రములలో జుట్టబడి, శత్రుసైనికులకు పంచిపెట్టబడెను. రోమును ఛేదించుటకు జేసిన మోసము, దౌర్జన్యము వృథయయ్యెను. ఫ్రెంచిప్రభుత్వము రాజీకొరకు ప్రార్థించెను. గారిబాల్డీ మహాయోధుడు. అతడు తన సేనలతో ఫ్రెంచిసైన్యమును మేకలమందను తోలినట్లు తరిమివేయుచుండెను.

కాని చివరకు రాజీప్రయత్నములు కుదురుటచే గారిబాల్డీ ముందుకుబోకుండ నాపివేయబడెను. ఒకవంక సంధిప్రయత్నముపై వ్రాలుచేయుచు ఫ్రెంచిప్రభుత్వము నీతిని విడిచి హఠాత్తుగా రోముపైబడెను. యూరపురాజకీయములలో నిట్టి దుర్మార్గము మరొకటి కానిపించదు.

ఫ్రెంచిసైన్యములు తండోపతండములుగా నుండెను. రోమును ముట్టడించుటకు తగిన పెద్దపెద్దతుపాకుల నన్నిచోట్ల నమర్చి వారు స్వల్పసంఖ్యాకులై, సమరసన్నాహముతో లేని రోమనులపైబడిరి. ఐనను రోమను లొక్కమాసమురోజులు హోరాహోరీని పోరిరి. రోమునగరమును కాపాడుట కితరప్రాంతములనుండికూడ ననేకమంది యిటాలియనులు వచ్చిరి. అట్టి వీరశిఖామణు లంతమంది యిటలీకొరకు మరెన్నడును పోరాడియుండలేదు. మెడిసి, బిక్సియో, మాన్రా, మామెలీ, యుగోబాసీ, బెర్టనీ, పైస్కనీ మొదలగు 'నతిరథ మహారథు' లందరును ప్రాణములను సమర్పింపవచ్చిరి; వీరందరిపైన గారిబాల్డీ, మేజినీ లిద్దరును సర్వసేనానాయకులై పనిచేయుచుండిరి. ధనికులు, దరిద్రులు, పాపులు, పవిత్రులు, ప్రజాస్వామికవాదులు, రాజపక్షమువారు తమతమ యభిప్రాయములను మరచిపోయి రోముకొరకును దేశముకొరకును పోరాడిరి. నగరవాసు లందరునుగూడ నతిశాంతముతో నెట్టియిక్కట్టులనైన తమదేశముకొరకు పడుచుండిరి. ఆరువేల



మంది స్త్రీలు ఆసుపత్రులలో బనిచేయుటకు వచ్చిరి. ఈసమయమున మేజినీయొక్క యావేదనను వర్ణింపదరముకాదు. గారిబాల్డీ యోధుడేయైనను కోపి; అతని తెలివితక్కువవలన ముట్టడి మరింత త్వరలో పూర్తియయ్యెను. చాలమంది నాయకులు హతప్రాణులైరి. మేజినీస్నేహితులు చాలమంది స్వర్గస్థులైరి. గారిబాల్డీ తనతోడి కుట్రదారుల ప్రోత్సాహముచే మేజినీ కెదురుతిరిగి యతనిపై నిందల నారోపింప మొదలిడెను ఎసంబ్లీయంతయు మేజినీకే మద్దతుగా నుండెను. "రాజు లోడిపోయి దాస్యము నంగీకరింతురుగాక! రిపబ్లికులు నాశనమై తమధీరోదారతను ప్రపంచమునకు వ్యక్తము జేయును" అని మేజినీ వారిని హెచ్చరించెను. ఇంక లాభములేదని తోచినపుడతడు ప్రాణములపై నాసవదలి వీధివీధులను భయంకరపోరాటములు సాగించుటో లేక యెసంబ్లీతోను, సైన్యముతోను అపినైనుపర్వతములకు బోయి యాస్ట్రియనులపై బడి రిపబ్లికుధ్వజమును రోమగ్నాలో నెగురవేయుటో చేయవలెనని సలహా యిచ్చెను; సైన్య మీరెంటిలో నేపద్ధతికైనను నొప్పుకొనెను. ఎసంబ్లీమాత్ర మీత్యాగము నంగీకరింపకపోయెను. మేజినీ తన పదవికి రాజీనామా నిచ్చివేసెను. గారిబాల్డీ తనతో గూడనున్న మూడువేలమందితో నీపరాభవమున కంగీకరింపక వెనుకకు పోసాగెను. "ఆకలి, దాహము, నిద్రయెఱుగని జాగరణము;

యీమాటని నేను మీకు ప్రసాదించెదను. కాని శత్రువుతో మాత్రము రాజీ యెన్నడును మనకు పనికిరాదు." అని యతడు వారిని ప్రోత్సహించుచుండెనట!

మేజినీమాత్రము కొంతకాలము రోములోనే యుండెను. ముట్టడి ప్రారంభమైనప్పటినుండియు నతడు నిద్రమెరుగడు; అతడు బడలికచే కృశించియుండెను. తిండిలోకూడ నర్థాకలిమైన మోటతిండిమాత్రమే యతనికి ప్రాప్తించెను. రెండు నెలలలో నతడు ముసలివాడై పోయినట్లు కాన్పించెను. కాని ముఖమెప్పటివలె "ప్రసన్నముగను, శాంతముగను జూపట్టుచు మునుపటికంటె తీవ్రమైనకార్యదీక్షను వెలిబుచ్చుచుండెను"

అతడింకను మిగిలినసేనను, ప్రజలను బ్రోత్సహించి మరియొకసారి పోరవలెననియాశించుచునేయుండెను. అతడట్టి భయమును లేకుండ రోమువీధులలో నొంటరిగా దిరుగుచున్నను ఫ్రెంచి ప్రభుత్వమువా రతని నరెస్టుచేయజాలకుండిరి. చివర కనేకమందిస్నేహితులప్రోత్సాహముచే నతడు రోమువిడిచి జినీవాకు పయనమయ్యెను.

మేజినీ జినీవాలో కొద్దిరోజు లుండి లాసేనుకు మారెను. అక్కడ తనతో రోములో పనిచేసిన కొంతమంది కలసి యొకయిల్లు తీసికొనిరి. వెనుకటివలె మేజినీ మరల యుత్తర ప్రత్యుత్తరములను, వార్తాపత్రికలను, గ్రంథరచనలను



ప్రారంభించెను. పత్రిక యెప్పటివలెనే కొద్దికాలములో నణచి వేయబడెను. ఇటలీలో పశుబలము జయించెనను విచారమును, స్నేహితులు చనిపోయినా రను విచారమును అప్పుడప్పు డతనిని బాధించుచుండెను. 1850 లో ఫ్రాన్సులో సంస్కారములనుగురించి యాందోళన బయలుదేరెను. విప్లవమున కీసమయము వీలగునేమో యను నుద్దేశ్యముతో మేజినీ ఫ్రాన్సు వెళ్ళెను. దానివలన నెట్టిఫలితమును లేకపోవుటచే నతడు తిరుగ స్విడ్జరులందువచ్చెను. అతనికచ్చట మరల నిర్బంధము ప్రారంభమయ్యెను. ఈ కారణముచే నతడు నవంబరు నెలలో నొకరాత్రి యింగ్లండునకు పయనమయ్యెను.

ఈసారి యింగ్లండులో నతని కనేకమంది స్నేహితులుండిరి. లండను మునుపటివలె నసహ్యముగా కాన్పించలేదు. తన పనులను నిర్వహించుకొనుటకు లండనులోనే యనేకసౌకర్యము లతనికి చేకూరెను. అతని యాదాయముకూడ నీసాగి కొంచెము హెచ్చుగానే యుండెను. అతనితల్లి చనిపోవునపుడు సంవత్సరమునకు 150 పౌనుల యాదాయము. (అత డితరులకు దానధర్మములక్రింద నావైకము నిచ్చివేయునను భయముతో గొంతమంది ధర్మకర్తలపరముచేసి,) యతని యావసరముల కిచ్చున ట్లేర్పాటుచేసెను. అత డెప్పుడును తన యావసరములకొరకితరులనుండి యొక్కపైసనైనను తీసికొనెడివాడుకాడు. మొత్తముమీద రెండువందల పౌనుల యాదా

యము మాత్రమే యతనికివచ్చుచుండెను. ఇందులో యెనుబది పౌనులు తాను రక్షించిన స్త్రీయొక్క పిల్లల చదువుకును, మిగతసొమ్మంతయు దన యుద్యమముకొరకును వెచ్చింపబడుచుండెను. తన చిన్నగది; సామాన్యపుభోజనము (తదన్నము తద్రసము) యివియే యతని ఖర్చులు. ఈచిన్నగదిలో ప్రతిసామానుమీదను పుస్తకములో, కాకితములో పత్రికలో పడియుండును; గదియంతయు చవుకబారు సిగరెట్లపొగతో నిండియుండును; అత డతిజాగ్రతతో పెంచు లత లొకవంక తొంగిచూచుచుండ సాయంత్రముపడువరకు నత డట్లేవ్యాసములు, యుత్తరప్రత్యుత్తరములు, కరపత్రములు వ్రాయుచుండును. అతడు స్థాపించినరాత్రిపాఠశాల యథాప్రకారముగా జరుగుచునేయుండెను. అత డంతేకాక తన యుద్యమమునకు తగినంత ధనమును వసూలుచేయుచు, దనతోవచ్చిన యిటాలియనుస్నేహితులకు పనిపాటులను గల్పించుచు, నింగ్లండులోనున్నస్నేహితులకుటుంబపరిపాలనలోను, సుఖదుఃఖములలోను సలహాలను జెప్పుచు, వారి కాధ్యాత్మికజ్ఞానమును బోధచేయుచు రేయింబవళ్ళు కార్యనిమగ్నుడైయుండెడివాడు.

ఇంగ్లండులో నతనికి స్నేహితు లెక్కువయై యుండియే యతనికి రెండవజన్మభూమిగా నుండెను. ఐనను మాతృదేశముకొర కతడు పలవరించుచుండెడివాడు. "నే నేదేశ



ములో హాయిగా నివసించుటకు నిషేధింపబడితినో యట్టి నా యిటలీలో, నాయిటలీకొరకు నేను చనిపోవునట్లు దైవమును ప్రార్థింపుడు." అని యతడు స్నేహితులకు వ్రాయుచుండెను. పాప మతనితండ్రి 1848 లో చనిపోయెను. బాల్యమునుండియు దండ్రి కెట్టిసహాయమును చేయలేకపోతి ననువిచారము మేజినీని బాధించుచునే యుండెను. అతని తల్లి 1852లో చనిపోయెను. ఇది యతని మనోవ్యధకు గొంత కారణమయ్యెను. ఆమెస్థానమును పూరింపగలవారిక నీప్రపంచములో నెవరుగలరు! ఇటలీ స్వాతంత్ర్యమును, సంపూర్ణస్వేచ్ఛను బడసిన తరువాత "నత డావిజయోత్సాహముతో దనతల్లిని తిరుగ కలుసుకొనవలెనని యెల్లపుడును కలలను గనుచుండెను." ఆమెమరణమువలన నతడు మరింతయుత్సాహముతో కార్యరంగమున దురుకుచు "శరీరధారిణియై యున్నప్పటికంటె నిపుడు నాతల్లి నాకు మరింత సామీప్యమునన్నది. ఆమె యామోదాశీర్వాదములను బడసిన నాధర్మము నాకిపుడు మరింత పవిత్రవంత మగుచున్నది. నాకిపు డీప్రపంచములో నాదేశమాతకన్న వేరుతల్లి లేదు. నాతల్లి నన్నట్టికష్టములలో నైనను ప్రేమించి లాలించెడిది. నేనును నాదేశమాత నెల్లపుడును ప్రేమింతును." అని యతడు వ్రాసెను.

ఇంగ్లండులో బహుఖ్యాతివడసిన వేదాంతులు, రాజకీయవేత్తలు, కవులు, శాస్త్రవేత్తలు మొదలగువా రనేకమంది

యతని మిత్రబృందమైరి. వెనుకటికంటె నతఁ డీసారి యెక్కువ యుత్సాహముగను, సంతోషముగను నుండెను. "రోమను విప్లవమువలన నతఁడు ధీరోదారుఁడయ్యెను. అప్పటినుంచియు నతని ముఖవిలాసము తేజోవంతమయ్యెను." అని కార్లైలు వ్రాసెను. తానొక యుత్కృష్టధర్మమును యథోచితముగా నెరవేర్చ గలిగితినను భావ మతనికి మరింత సౌమ్యతను దెచ్చిపెట్టెను. దయారస మతనిలోనుండి వెల్లి విరియుచుండెను. అతఁడు పిల్లలను, జంతువులను నెక్కువగా బ్రేమించుచు వారితో నాటపాటలు సలుపుచు వారిలో నొకఁడై యానందమున నుండెడివాఁడు. కుక్కలు, పిల్లులు, పక్షులు మొదలగునవి యతనిచుట్టును గంతులు వేయుచుండెడివి. అతఁడు పెంచుచుండిన పక్షులెప్పుడు నతనిని విడువకుండనుండెడివి. స్నేహితు లెప్పుడతనిని జూడవెళ్ళినను యతని భుజముపైనను తలపైనను నొకటిరెండు పక్షులు వ్రాలి యుండెడివి.

అతనిని జూడవచ్చిన యువకులందరు నతని సంభాషణను, జీవితమును, యాదర్శములను జూచి సమ్మోహితులగుచుండిరి. భగవంతుఁడు, ప్రజలు, ధర్మము యీమూడుమంత్రములను మాత్రమే యతఁడు వారి కుపదేశించును. ఇట్టి యుపదేశములచే నతనితరములోని మరెవరును ప్రబోధించ నట్లతఁడు యువకులను ప్రబోధపరచెను. తనజీవితమును, తన సర్వస్వమును తన యాదర్శములకొఱ కర్పణముచేసి, దారి



ద్ర్యము నే ధర్మపత్నివలె వరించి, విద్యావిషయములను మరచి పాపజీవితమున కొడిగట్టుచు కుత్సితములకు బలువులెత్తుచుండు ప్రపంచముకొఱకు విచారగ్రస్తుఁ డగుచు, నొక మహోత్కృష్టరంగము నవధరించి, యూరపువంతను బునఃప్రతిష్ఠింప నుద్యమించిన యొక మహావ్యక్తి, నయ, నీతివిశారదుఁడు, వేదాంతి యువజనహృదయముల నాకర్షించుటలో నాశ్చర్యమేమికలదు! ఆంగ్లేయుల మనోభావముల నతఁడు మార్చివేసెను. "మేజినీ మనయుగమును సృష్టించిన యథార్థోపదేశకుఁడు" అని ఆర్నోల్డు వచించెను. ఇంగ్లండులో నతఁడేమి చేసినను తనదేశముకొఱకే చేయుచుండెను. ఇంగ్లండులోని ప్రచారమువలన నతఁడు మూఁడుఫలితముల నాశించెను. ఇటలీస్వాతంత్ర్యముపట్ల నింగ్లీషుప్రజలయొక్కయు, పత్రికలయొక్కయు నైతికాభిమానమును బడయుట; ఇంగ్లండుయొక్క పరదేశనీతిని యిటలీకి సుముఖముగా నుండునట్లు చేయుట; తన విప్లవప్రయత్నములకు ధనమును చేకూర్చుట. అతఁడు యిటలీయొక్క 'మిత్రబృంద'మను నొకసంఘమును స్థాపించి తన స్నేహితులందరను జేరదీసెను. ఇంగ్లండులో నున్న యన్ని తరగతులవారిని, యన్నిసంఘములవారిని యతఁడు తనయుద్యమమునకు సుముఖముగా ద్రిప్పివేసెను. పైసంఘము యిటాలియను స్వాతంత్ర్యముపట్ల నింగ్లండులో తగినంత సుముఖత్వము సంపాదింపగలిగెను. పత్రికలన్నియు నిటలీని సమర్థించుటే

కాక నాస్ట్రియాను గర్జించెను. ధనముకూడ నంతయెక్కువగా రాకపోయినను ననేకచోట్లనుండి ప్రోగుచేయబడెను.

---

### జయము—అపజయము.

అతడు యిటలీలో చేయవలసినపని ముగించెనని చెప్పవచ్చును. ఇటలీలో నతని యాశయములు పాతుకొనిపోయెను; ఎచ్చట జూచినను స్వాతంత్ర్యనాదములు ప్రతిధ్వనించుచుండెను. అతనిసిద్ధాంతములు చాలవరకాచరణలోనికి తేబడుచుండెను. ఇటలీలోనున్న మేధావంతు లందరు నతనివ్రాతల నాస్వాదించియే దేశభక్తులు, ప్రజాస్వామికవాదులు, స్వాతంత్ర్యప్రియులు నైరి. కుట్రలు, రహస్యప్రయత్నములు కావలసినరోజులు గతించెను. పైడ్మాంటు స్వేచ్ఛను బడసి పరప్రభుత్వముతో దలపడుటకు సర్వప్రయత్నములను జేయుచుండెను. రాజకీయకక్షలలో మాత్ర మింకను విభేదము లుండెను. మేజినీ యాదర్శపురుషుడు; సిద్ధాంతములలో రాజీ కెన్నడును యొప్పుకొనడు. ఆత డెప్పుడును రిపబ్లికునే సమర్థించెను; దానికొరకే కలలను గనుచుండెను. అదియే యిటలీయాదర్శమని ముక్తకంఠమున నుద్ఘోషించుచుండెను. ఇంతటితో రాజకీయములను మాని సాహిత్యసేవ యొనర్పవలసినదనియు దానివలన నతనికీర్తి దశదిశలమ్రోగగలదనియు నతనిస్నేహితులందరును బలవంతపెట్టసాగిరి. మేజినీ



చేతులు ముడుచుకొని యెట్లు కూర్చొనగలడు! అది యతని తత్త్వమునకు వ్యతిరేకము; అతడు దేశమోక్షముకొరకుదహించుచుండెను. కార్యవిహీనులై యూరకుండుట దేశద్రోహము; ధర్మహాని; మహాపాతకము; ఆశయములతోపాటు కర్మకలాపముకూడ యుండితీరవలెను. "మనకార్యములే ప్రజలకు పుస్తకములవంటివి" "యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరోజనః" ప్రజాసామాన్యములో విద్య యనలే లేనపు డిది మరింతయావసరము.

ఆస్ట్రియనులు, పోపు, నేపిల్సు మొదలగు నిరంకుశప్రభువు లొకవంక యిటలీని పీడించుచుండ నత డెట్లూరకుండగలడు! "పశుబలము యథేచ్ఛగా జయజయధ్వానముల నలుపుచుండుట; స్నేహితులును, సోదరులును వేనవేలుగా యూరపు అంతటను దేశాంతరవాసముల ననుభవించుచు నచ్చటనే మగ్గిపోవుచుండుట; వారితల్లులు, యక్కచెల్లెండ్రు, భార్యలు వారికొరకు జన్మాంతము నేడ్చుచుండుట; యవినీతి, యసత్యప్రచారము, గూఢచారులకుట్రలు, నిరంకుశపదఘట్టనములచే శోషించుచున్న ప్రజాక్రోశము; ధీరులవలె బోరుచు బ్రపంచమునకు దెలియకుండ జనిపోవువారి సంఖ్య; నిరాశజెంది యాత్మగౌరవమును, స్వశరీరములను పరప్రభుత్వమున కమ్ముకొనిన వారి కొరకు లజ్జ- యిట్టి విపరీతపరిస్థితుల కిక నిటలీలో చోటివ్వరాదు. దేశములోని పురుష

శ్రేష్ఠులు, ధీరోదారులు, రాజపుత్రు లొకరొకరుగా నురికం బములకు గురియగుచుండ జూచుటకంటె మనజాతీయధ్వజము నెగురవేయుచు భగవంతు డవ్యక్తసాక్షిగా జూచుచుండ, న శ్వత్రోల నొక ఘోరసంగ్రామరంగమున కూలి వీరస్వర్గమున నలంకరించుట బురుషలక్షణము" అని యతడు వారికి బదులుచెప్పెను.

సమయమును బట్టి, పరిస్థితుల కనుకరించులాగున పద్ధతులను మార్చుకొనవలెననియు, పైడ్మాంటురాజు ఆధిపత్యము నంగీకరింపవలెననియు, నతనికి గొంతదేశము నీయవలెననియు, నైకమత్యమే కావలెననియుఁ జిన్నచిన్న విప్లవములను లేవదీయుటవలన లాభములేదనియు నొకపక్షమువారు వాదించుచుండిరి. మేజినీ తన రిపబ్లికువాదమును విరమింప నిచ్ఛగింపలేదు. దీనివలన గొన్నికష్టములను తా వేర్పడినను ఆదర్శపురుషులు తమ యాదర్శముల నెన్నడును విడువనొల్లరు. వారు వానికొరకే జీవింతురు; వానికొరకే చనిపోవుదురు. తాత్కాలిక జయాపజయములతో వారికి బనిలేదు.

“ అద్యవాఽబ్దశతాంతేపివా ”
“యత్నేకృతే యదినసిధ్యతికో ఽత్రదోషః”

నేడుకానిచో నూరేండ్లయిననేమి? ప్రయత్నముచేయుము; అపజయ మెన్నడును దోషముకాదు. తనప్రయత్నముల నతడు మానలేదు; తన యాశయములను వీడలేదు;



1850 లో నతడు ‘ఇటాలియనుజాతీయసంఘము’ అనునొక సంఘమును లేవదీసెను. రోమను ఎసంబ్లీ కిది నకలువంటిదని యత డాశించెను. ఇటలీలో గొంతమంది దీని నామోదించిరి. కాని తగిన కట్టుదిట్టములు లేక నిది 1853 లో నంతమొందెను. అతడు ‘‘జాతీయఋణము’’ను చేకూర్చవలెనని కూడ సంకల్పించెను. విప్లవమునకు తగినంత ధనము వసూలుచేయవలెనని యతడు ‘బాండు’ (Bonds) లను జారీచేసెను. ఈ బాండులను భావి ఇటాలియనుప్రభుత్వము చెలామణి చేయగలదని ప్రకటింపబడెను. చాలబాండులు తీసికొనబడెను. చివర కిదియు విఫలమైపోయెను. మిలనులో గొంతమంది పారిశ్రామికులు విప్లవమును లేవదీసి యతనిసహాయము నడిగిరి. విప్లవమునకు సహాయము చేయుటే యతని వ్రతము. వారికి ధనమును, జనమును పంపించుటే కాక దానుకూడ 1852 లో ప్రచ్ఛన్నముగా లొకార్నోకు వెళ్ళెను. అదియును విఫలమై పోయెను; ఆయుద్యమమునకు తగినంత పటుత్వము, స్తోమతు లేకపోయెను. రెండవపక్షమువారతనిని దూషింప నారంభించిరి. అతడు దూషణ భూషణముల నొక్కమాదిరిగనే గ్రహించెను. అమెరికాలో గూడ ప్రచారమొనరించుట కత డేర్పాటులను జేసెను. ఇంగ్లండు, ఫ్రాన్సుల విముఖత్వమున కమెరికాయెంతయు నాడేశములను గర్హించెను. అమెరికనుకన్సలు లండనులో నతనికి

గొప్పవిందుకూడ చేసెను. 1854 లో నతడు పారిసుకును, యిటలీకిని ప్రచ్ఛన్నముగా బోయెను. ఇటలీ, ఫ్రాన్సు, స్విడ్జర్లండు దేశములలోని పోలీసువా రతనిప్రచ్ఛన్న రాకపోకలవలన బడిన తాపత్రయము వర్ణనాతీతము. ఆరోజులలో నొక గీతమును ప్రతివాడును పాడుచుండెడివాడు. దానిభావ మిట్లుండెను.

“మేజినీయెక్కడ! మేజినీయెక్కడ! అని ఆల్ప్సు, అపినైను పర్వతములమీదనున్న సీరంగవృక్షములు ప్రశ్నింపనే నిముసమందు పుచ్ఛల నెగురవేయుదురో యనుభయభ్రాంతతచే ప్రాణముల నరచేతులలో నుంచుకొని దాగొను దేశద్రోహు లెచ్చటనుందురో యచ్చట నతడుండును. ఇటలీకొరకు దమప్రాణరక్తమును ధారవోయ నాతురపడుచు క్షణమైన నాలసింపలేకయున్న ధీరు లెచ్చటనున్నారో యచ్చటనే యతడు నుండును.” ఇట్లతడు శత్రుమిత్రహృదయస్థుడై యుండెను.

1855 లో కోమోకొండలలో మరియొక విప్లవప్రయత్నము గావింపబడెను. కాని స్విడ్జరులండు పోలీసులవలన నది భగ్నమయ్యెను. మేజినీ కష్టముమీద తప్పించుకొనగలిగెను.

తరువాత దక్షిణయిటలీలో మరియొకవిప్లవము నతడు లేవదీసెను. దానికొరకు ఇంగ్లండులో కొంతద్రవ్యమును ప్రోగుచేసెను. గారిబాల్డీకూడ దీనికి తోడ్పడెదనని యొప్పు



కొనెను. కావూరు మంత్రికూడ రహస్యముగా ధనసహాయము చేసెదననెను. చివరకు కావూరు వాగ్దానభంగ మొనర్చెను. మేజినీమాత్రము తనప్రయత్నములను విరమింపలేదు. జినీవా, లెగ్హారను కోటలలోనున్న మందుగుండుసామగ్రిని తీసికొనివచ్చుట కేర్పాట్లు జరిగెను. మేజినీచుట్టును వేగులవాండ్రెల్లపుడును దిరుగుచునేయుండిరి. చివరకిదికూడ ప్రభుత్వముచే భగ్నము గావింపబడెను. మేజినీ మరికొంతమందితో తప్పించుకొనిపోయెను. అతడొకయింట దాగొని పోలీసువారు వెతుకవచ్చి యాయింటిని సోదాచేసినపుడు ద్వారపాలకుని వేషము ధరించి తానే వారికి తలుపుతీసెనట!

ఈపరిస్థితు లన్నిటిని దాటి మేజినీ తిరుగ ఇంగ్లండుకు బయనమయ్యెను. ఇంతలో నిటలీలో పైడ్మాంటు రాజు కావూరుమంత్రిల నాయకత్వముక్రింద తిరుగ స్వాతంత్ర్యపోరాటమారంభమయ్యెను. ఫ్రాన్సుతో మిత్రత్వము పనికిరాదని మేజినీ యెంతజెప్పినను కావూరుప్రభృతులు వినలేదు. అంతఃకలహములు కలుగుననుభయముచే చాలమంది రిపబ్లికువాదులు క్రమముగా రాజు నాయకత్వము నంగీకరించిరి. ఇట్లొకవిధమైన యైక్యత యేర్పడెను. మేజినీకూడ నైక్యతనే ప్రధానముగ భావించి రాజుపక్షమువా రైక్యతకొరకే కృషి చేయునంతకాలము రిపబ్లికువాదమును లేవదీయనని కావూరుకొక లేఖను వ్రాసెను. అతడు తగుసలహాలనుగూడనిచ్చెను.

పోపురాష్ట్రములను లాగికొనుటకు టస్కనీ రోమగ్నాలను మిలిటరీ కేంద్రములక్రింద మార్చవలెననియు నక్కడనుండి నేపిల్సునకు దక్షిణమునకును బోవుట సులభమనియు నతడు సలహా చెప్పుటే కాక సిసిలీలో విప్లవప్రయత్నములకొరకు కొంతమందిని బంపెను. అతడు ముందుకు అంబ్రియావైపుకు సైన్యములను తరలించవలెనని గారిబాల్డీని ప్రోత్సహించుచు "నావ్యక్తిత్వమును వదలుకొని" నిన్నే యుద్యమమునకు నాయకునిగా జేయుదుననుచు బ్రోత్సహించెను. అతని యొద్దనున్న సమస్తమును చిల్లిగవ్వసహిత మత డీయుద్యమమును సిసిలీలో నడుపుటకు వినియోగించెను. అతడు యుద్ధరంగసమీపమునకు లుగానోవరకును బోయెను. గారిబాల్డీ తన వెయ్యిమంది యోధులతోను సిసిలీకి బయనమగుటతోడనే మేజినీ గంతులు వైచుచు "ఇటలీ చనిపోలేదు. నేనందుకు భగవంతుని ప్రార్థించుచున్నాను." "నేను శరీర, బుద్ధిబలములలో నానాటికి క్షీణించిపోవుచున్నాను. గారిబాల్డీద్వారా యిటలీయైక్యత సంపాదించుట శ్రేయస్కరమైనవిషయము" అనుచు నవంబరులో మేజినీ గారిబాల్డీతో మిత్రసంభాషణమునుజరిపి రోము వెనీసులను జయించుట కాలోచనలను సలుపుకొని నేపిల్సువీడెను.

కాని యైక్యత చేకూరువరకు నతనికి శాంతిలేదు. శాంతముగా గ్రంథరచనతో కాలము గడుపవలెనని యత



డెంతయనుకొనినను, యిరువదేండ్లునుండి, యాందోళన, విచారము, కార్యభారము మొదలగువానితో గ్రుక్కియున్నను రాజకీయముల నత డెట్లు వీడగలడు! తన మహదాశయములను గురించి యత డిట్లువ్రాసెను. "యూరపుయంతయు నొక పెద్దయెడారివలె నాకు గాన్పించుచున్నది. శూన్యవాదమే దానికున్న జాడ్యము; విశ్వాసము, మతము, భగవంతుడు, ధర్మము నారాధించుట, యచంచలమైన నైతికసిద్ధాంతములు, మహదాశయములు మొదలగునవన్నియు శూన్యముగానున్నవి. సర్వసంకటములకును మూలకారణమై, సమస్తబాములకోర్చి పాటుపడుచు కడుదరిద్రము ననుభవించుచున్న కర్షకుల యౌన్నత్యమునకు బనిచేయువా రెవరును లేరు. ఇటలీ లేచి యూరపుయొక్క యీమహానర్థములను దీర్చివేయునని నే నాశించుచుంటిని. నే నాశూన్యమును బూర్తిచేయుదునని యిటలీ సగర్వముగ చాటునని యాసించుచుంటిని. ఇన్ని యోజనముల విస్తీర్ణముగల యిటలీ ధాన్యమును చౌకగా పండించుకొని తినుచున్నది. కాబేజిపువ్వులను హాయిగా నాస్వాదించుచున్నది; యనునంత మాత్రముననే నేను సంతోషించువాడనుకాను. యూరపునంత నుద్ధరించునట్టి శక్తి రోమునుండి బయలుదేరినకాని రోముయనిన నాకు గౌరవముండజాలదు. ఇటలీ యుత్కృష్టతను, యుదారతను, నైతికబలమును, గుణగణములను నార్జింపవలెను. ఈప్రపంచములో

నదియొకధర్మమును నిర్వహింపవలెను" కాని యింకను యిటలీ యైక్యమునొందలేదు. రోము వెనీసులను జయించిన గాని తనయాశయము లన్నియు నీడేరజాలవని యతని దృఢవిశ్వాసము. "నేను వెనీసు, రోములకొరకును, రిపబ్లికు కొరకును చేయు నిరంతరకృషిచే మరణమునొందుదును గాక" అత డైక్యతకొరకు తన రిపబ్లికు ప్రచారమును మానివేసెను. "ఇటలీలో నైక్యత కుదిరిన తరువాత రైళ్ళు, గనులు, ఛర్చి భూములు ప్రభుత్వపరము చేయబడవలెను. అందరు నైచ్ఛిక సేవాదళమున చేరవలెను; ఇతరపరిశ్రముల ననేకములను వృద్ధి చేయవలెను; ఉత్పత్తి నభివృద్ధిచేయు పరపతి సంఘములను, ప్రభుత్వము ప్రోత్సహింపవలెను." అనునిట్టి దేశహితైక సంస్కరణాభిలాషతో నతడు కాలముకొరకెదురుచూచుచుండెను. అతడు 1860లో నేపిల్సునుండి మరల నింగ్లండుచేరెను. ఒక వంక కనుదృష్టి తగ్గిపోవుచుండెను. శరీరపటిమ క్షీణించుచుండెను. వ్యాధికూడ బయలుదేరెను. వ్రాయుట చాల కష్టతరముగా నుండెను. ఐనను యతనియుత్సాహము మేరలేకయుండెను. "నీయిచ్ఛాశక్తిని ప్రయోగించి స్వస్థతజెందుము. నే ననేకసారు లట్లేచేసి విజయమును గాంచితిని. నీవస్వస్థతగా నున్నట్లు వింటిని; నీ వట్లుండరాదు. జాతులు స్వేచ్ఛకొరకు పోరాడుచుండ నస్వస్థతగానుండుట దోషము; పాతకము" అని యతడొక స్నేహితునికి వ్రాసెనట! కాని యతనికష్టము



లింకను గట్టెక్కలేదు. డబ్బుకొరకు బాధ మరల హెచ్చుచుండెను. పుస్తకములమీద వచ్చురాబడి తగ్గిపోయెను. మందులకు చాలధనము ఖర్చుపెట్టవలసి వచ్చెను. ఇటలీలోను, యింగ్లండులోను కొన్నివందలపౌను లతనికొరకు వసూలుచేయబడెను. అత డాధనమునంతను ప్రజాకార్యములకు ఖర్చుపెట్టివేసెను; వెనీసుఫండుకు గొంతపంపించెను. శరీరావస్థమారుటచే నవయవములలో బాధ బయలుదేరెను. "నే నెప్పుడు నొకమాదిరిగనే యున్నాను. తగినంత యుత్సాహము లేకపోయినను ధర్మము, ధర్మము అనుమంత్రమును జపించుచు నిరంతర కృషిలో మునిగియున్నాను. నాజీవితదీప్తి కొద్దిరోజులలో సమాప్తము కానున్నది. కనుక నావ్యక్తికొరకు నేనేమియు కోరుటలేదు; ఆశించుటలేదు. నేను ప్రేమించువారిని నాకు వారు కలుగజేయు సంతోషముకొరకు గాక దుఃఖముకొరకే ప్రేమించుచు నిటలీకొరకును, ప్రపంచముకొరకును చిన్ననాటనుండియే నేను ననుచున్న కలలనే గనుచు, ప్రస్తుత మనారోగ్యముగా నున్నను వైరాగ్యమును శాంతిని బొందియున్నాను." అని యతని మనోవేదనను వెలిబుచ్చెను. ఈసమయముననే యమెరికాదేశములో నంతఃకలహములు ప్రజ్వరిల్లెను.

అయం నిజః పరో వేతి గణనా లఘుచేతసాం
ఉదారచరితానాం తు వసుధైవ కుటుంబకం.

ఇదినాడి యిది యితరులది; యనునది కించిజ్ఞుల లక్షణము; ఉదారచరితులకు బ్రపంచమంతయు నొక్కటే కుటుంబము. మేజినీ భానిసవర్తకమును చిన్ననాటినుండియు ద్వేషించుచుండెను. ఇట్టి వర్తకమును మాన్పుటకు జరుగుచున్న యీపోరాటమున కతడు తన యామోదమును వెలిబుచ్చి చందాలను పోగుచేసి పంపించెను. "ఈరోజులలో బ్రతిమానవుడును దన యంతరాత్మ ననుసరించి బ్రశాంతముగా చనిపోవలెనన్న మూడుదోషములను గర్హించవలెను. భానిసవర్తకము; కఠిన దండన; (capital punishment) సంకుచితమతావేశము లేక మతద్రోహము." అని యత డమెరికావాసులను హెచ్చరించెను. గారిబాల్డీ మేజనీలమధ్య సఖ్యత యంతగా లేదు. మేజినీసిద్ధాంతములనిన గారిబాల్డీకి తలనొప్పి. "గారిబాల్డీకి రెండుమార్గములను జూపి దీనిలో దేని నామోదింతువనిన నతడు తప్పక నేను చూపినదానినే నిరాకరించును" అని మేజినీ యొకసారి చెప్పెను. ఇందులో నసత్య మెంతమాత్రమును లేదు 1849 లో రోములో జరిగిన స్పర్ధనేయతడెప్పుడును కడుపులో పెట్టుకొనెను. కాని మేజినీ తప్పేమియు లేదు. "ఒక్కసారి గారిబాల్డీని వైచ్ఛికదళముతోగూడి బనిచేయనిందు; తరువాత నతడు నన్ను దయ్యములకొప్పగించిన నొప్పగించునుగాక!" అని యత డనెను. గారిబాల్డీ చెప్పుడుమాటలను వినును. అతనిచుట్టు నున్నవారు మేజినీపై ద్వేష



ము నతనిలో బుట్టించిరి. అతనికి రాజుపట్ల విశ్వాసమెక్కువ; రాజుమంత్రియైన రటజీ గారిబాల్డీతో కపటనాటకమును నడిపెను. మేజినీ దానిఫలితమును ముందరే సూచించి దానిని గర్హించెను. ఐనను "రోము లేక మృత్యువు" అని గారిబాల్డీ శంఖారావము నొకసారి పూరించుటతోడనే మేజినీశరీరముప్పొంగి చాలసొమ్ము వసూలుచేసి పంపెను. ఆత డీసందర్భములో లండనువీడి లుగానోవరకుగూడ వెళ్ళెను. ఇంతలో గారిబాల్డీ గుండుదెబ్బతగిలి పడిపోయె ననునసత్యపువార్త యతనికి దెలియవచ్చెను. మేజినీ యీవార్తవిని నేలగూలెను; స్మృతి తప్పిపోయెను; చనిపోయిన దేశభక్తులందరు నతనిని నిందించుచున్నట్లు గాన్పించెను. స్నేహితు లతనిబాధను తీర్పజాలక పోయిరి. కొంతసేపటి కతడు తెలివినొందెను. గారిబాల్డీ విఫలమనోరథుడయ్యెను.

తరువాత 1863 లో పైడ్మాంటురాజు మేజినీతో రాయబారములను జరిపెను. వారిద్దరియాశయములు కొంచెమించుమించు యొక్కటే యయ్యెను. చాలకాలము రాయబారములు జరిగినతరువాత మేజినీ వెనీసులో విప్లవమును లేవదీయుటకును, రిపబ్లికువాదమును లేవనెత్తకుండుటకును నంగీకరింపబడెను. రాజు విప్లవకారుల కాయుధములను సరఫరాజేయుటకును చివరకు యుద్ధము బ్రకటించుటకును నంగీకరించెను. కాని రాజు దీని నమలుజరుపుటకు భయపడి వా

గ్దానభంగ మొనర్చి గారిబాల్డీతో రాయబారములను నడి
పెను. మేజినీ గారిబాల్డీని తన వెనీసువిప్లవమును నడుపుమని
కోరెను. అందుల కతఁ డొప్పుకొనెను. ఈసమయమున
గారిబాల్డీ యింగ్లండులోనే యుండెను. వారిరువురును గొంత
వరకు సఖ్యపడిరి. ఒకవిందులో మాట్లాడుచు గారిబాల్డీ మే
జినీ తనకు బాల్యమునుండియు స్నేహితుడనియు, చిన్నతన
ములో సలహాదారుగా నుండెననియు నుడివెను. అతనిమాట
లను నమ్మి మేజినీ వెనీసుయుద్యమముకొరకు మరల లుగా
నోవరకు బోయెను. గారిబాల్డీ రాజుపక్షమున జేరి వాగ్దాన
భంగ మొనర్చెను. రాజు మరల భయభ్రాంతుడై గారిబా
ల్డీని మోసపుచ్చెను. మేజినీ యిట్టిచేష్టితముల కెంతయు ను
గ్రుడయ్యెను. ఇట్టి 'ద్విజిహ్వ'ల నతడామోదింపజాలడు. రాజు
ఆస్ట్రియాతో రోము నిచ్చివేయుట కంగీకరించి సంధియొనర్చు
కొనెను. మేజినీ యిట్టియవమానమును భరింప నిచ్ఛగింప
లేదు. ఆస్ట్రియానిరంకుశమును రూపుమాపవలెననియే యత
నివ్రతము. అట్టితరి యాస్ట్రియావలన ప్రసాదములను బడ
యుట కతఁ డెట్లొప్పుకొనును. ఇది జాతీయద్రోహము. "నేనిట్టి
జాతీయయసత్యముకన్న నాదేశ మింకొక శతాబ్దము దాస్య
ము ననుభవించుటే యోగ్యమని భావించెదను." అని యతఁడు
దానిని గర్హించెను. ఇంతలో నూతనమంత్రిత్వములు సంభవిం
చెను. వెనుకటిరాజీలు గాలి కెగురగొట్టబడెను. నూతనమంత్రి



యీసారి ప్రష్యాతో సంధిచేసికొనుటకు రాయబారము
లను నడిపెను. 1866 లో సంధిపత్రముపై సంతకములు చేయ
బడెను. ఇట్టిబేరములు మేజినీకి విషప్రాయముగా నుండెను.
కాని యతఁడొక్కడే యాదర్శములకొరకు ప్రాకులాడుచుం
డెను. రోము పోయినను వెనీసుమైనను దక్కుచున్నదనియు
దానిని స్వశక్తిచే నిటలీసాధించుటకు దానుకూడ సాయ
పడవలెననియు నతడు తనమైచ్ఛికసైన్యమునుగూడ దీనితో
జేర ప్రోత్సహించెను. ఇక్కడ జయము సంప్రాప్తించుచో
వెనీసునుంచి రోముకుగూడ దండయాత్రకు బోవచ్చునని
యత డాశించెను. అతడు యుద్ధసన్నాహములను చేయించె
ను. సైన్య మొకవంకనుంచియు వాలంటీర్లు మరియొకవంక
యాస్ట్రియాలో దిగి స్లావుజాతీయవారినిగూడ లేవదీయవలె
ననియు నేర్పాట్లు గావింపబడెను.

ఈసారి యిటలీ తప్పక జయించునని యందరు నాశిం
చుచుండిరి. కాని యీసారికూడ సరియైన నాయకత్వములేక
యపజయమే తటస్థించెను. యుద్ధరంగములలో నిటలీసైన్య
ము లోడిపోయెను. గారిబాల్డీకిని, వాలంటీర్లకును 1860 వ
నాటి యుత్సాహము నశించెను. కాని ప్రష్యా జయపరంప
రలను గాంచెను. నెపోలియను చివర కిది యెట్లు పరిణమిం
చునోయని భయపడి యాస్ట్రియా వెనీసును దనకిచ్చివేసెనని
యు నిటలీ సంధిగావించుకొనునెడల తాను వెనీసును యిటలీ

కిచ్చివేసెదననియు రాయబారములు నడిపెను. యుద్ధప్రయత్నముల నన్నిటి నాపివేయుటయు నిట్టినంధి కొప్పుకొనుటయు, నైరల్, యిస్ట్రియాలను వదలుకొనుటయు జయించుటవలనగాక నిరంకుశుడైన నెపోలియనువలన వెనీసు నెక ప్రసాదముగా బడయుటయు మేజినీ కింతమాత్రము నిష్టము లేదు. కాని సైనికపరిస్థితులనుబట్టి వీని కంగీకరింపవలసివచ్చెను. "నేను ప్రేమించిన యిటలీ తన ధర్మనిర్వాహణమున కింకను చాలియుండలేదను చింతతో నా యవసానకాలము నెట్లో దిగమ్రింగుకొనవలసిన దుర్దశ నాకు సంభవించెను" అని యతడు వాపోవుచుండెడివాడు.

---

## అవసానకాలము.

మేజినికి షష్టిపూర్తియయ్యెను. షోడశవర్షప్రాయమునుండియు నిటలీ రాజకీయాకాశమున దివ్యప్రభవలె వెలుంగొందిన యొకనక్షత్ర మంతర్ధానము కానున్నసమయ మగుచుండెను. "కష్టపరంపర లతనికి ముదిమిని దెచ్చిపెట్టెను. అతని ముఖకమలము మ్లానమయ్యెను; కాంతితరిగెను; శరీరము వివర్ణమయ్యెను. చక్కనిచిక్కని తుమ్మెదరెక్కలవంటి జుట్టు పలచనై తెల్లనైపోయెను. జరావ్యాధు లొకవంక నతనిని కృంగదీయుచుండ, కార్యభార మంతకంతకు హెచ్చుచుచుండెను. అతడు స్రుక్కి, శోషించి, విశ్రాంతికోయము సుడి



గుండములో పడి కొట్టుకొనువానివలె నుండెను. ఐనను నతడావంతయు వెనుదీయ డాయెను. "ఒకమహోద్యమముకొరకు నేను లేవదీసిన నాసోదరుల కుత్తరవాదినై యున్నాను. నేను చనిపోవులోపల రిపబ్లికుపరిపాలనను చాటించితీరవలెను." అని యతడు మరల కార్యనిమగ్నుడయ్యెను.

వెనుకటిరాజీ యతని కింతమాత్రము నిష్టము లేదు. ఎప్పటికైనను రిపబ్లికుపరిపాలనే వచ్చితీరునని యతని దృఢవిశ్వాసము. జాతీయావమానము దుర్భరము; సహింపరానిది; "జాతికి రాచపుండువంటిది" రిపబ్లికుపరిపాలనమే సర్వరోగములకును దివ్యౌషధము. అదియే రోమును జయించి, యిస్ట్రియా, నైరలులను తనలో కలుపుకొని స్వాతంత్ర్యముకొరకు పోరుచున్న ప్రాచ్యదేశములకు జేయూతనీయగలదని యత డెప్పుడును కలలను గనుచుండెను. రిపబ్లికుపరిపాలనమనగా నీచముగా పగదీర్చుకొనుటకాదు; ధన, ప్రాణ, మానవష్టములను విచ్చలవిడిగా, యథేచ్ఛగా, నిరంకుశముగా కల్పించుటకాదు; జాతీయఋణములను దుడిచివేయుటకాదు; మతద్వేషమును చూపుటకాదు. అది "యొకగొప్పనైతికవిద్య నొనగూర్పవలెను; బానిసలను నాగరికుల గావింపవలెను; వారికి వారిధర్మమును, శక్తిసామర్థ్యములను, వారి యుత్కృష్టతను బోధించు సుదర్శనముగావలెను." యను నాశయము లే యతని నెల్లపుడును కలవరపెట్టుచుండెను. కనుక నతడు మ

రల తన రిపబ్లికు ప్రచారమును సాగించెను. వృద్ధాప్యములో నుండియు నతఁడు తన శక్తినంతను దీనికే ధారవోయుచుండెను. స్వార్థపరులతోఁ గూడిన యుద్యమములు విఫలమగుటచే రిపబ్లికువాదు లిపుడు మునుపటికంటె హెచ్చుకాజొచ్చిరి. అనేకకదనరంగములలో నిటలీకి సంభవించిన పరాభవాగ్ని జాతీయహృదయమును దహించుచుండెను. జాతీయావమానము యిటాలియనుయువకులకు స్వాతంత్ర్యోన్మాదమును గలిగించుచుండెను. రాజుయొక్క గొప్పతనమంతయు దేశములో బూర్తిగా నశించెను. దేశమంతట నసంతృప్తి బయలుదేరెను. మేజినీయొక్క సంతత పరిశ్రమ, స్వార్థత్యాగము; ఆమరణాంత మేకాగ్రముగా దేశాంతరవాసము ననుభవించుట; సంకల్పదీక్ష మొదలగు నద్భుతవిషయములన్నియు బ్రజల నాకర్షించెను. ప్రజ లతని నొకదివ్యపురుషునివలె భావింప మొదలిడిరి. నలువదివత్సరములనుండియు మేజినీ దేశాంతరవాసము ననుభవించుచుండెను. నలువదివేలమందిప్రజ లైక్యకంఠముతో నతనిపై విధింపబడిన నిర్బంధమును తొలగింపవలెనని ఘోషింపనారంభించిరి. దేశమంతయు నతనివెనుకనుండెను. మెసినా యనురాష్ట్ర మనేకసారు లతనినే డిప్యూటీపదవి కెన్నుకొనుచుండెను. కాని యతఁడు పదవుల నాశించువాడుకాఁడు. బిరుదులకొరకు పరితాపపడువాఁడుకాఁడు. చివరకు మేజినీపై నిర్బంధము తొలగింపబడెను. కాని యత డిట్టి



దయాధర్మబిచ్చము తన కక్కరలే దనియు దాను డిప్యూటీ పదవి నంగీకరింపజాలననియు జెప్పి లుగానోలోనే యుండిపోయెను. ఇచ్చట నతనిస్నేహితులే యతని నీవృద్ధాప్యములో గంటికి రెప్పవలె గాపాడుచుండెడివారు; చికిత్సలను గావించుచుండెడివారు; సమస్తోపచారములను చేయుచుండెడివారు. ఈవృద్ధాప్యములోఁ గూడ నతఁడు పగలంతయు వ్రాసికొనుచు రాత్రులందు మిత్రసంభాషణమును సలుపుచు వారిని బ్రబోధపరచుచు, తరచు జినీవా వెళ్ళుచు తన కుట్రప్రయత్నములను గావించుచు రిపబ్లికు రాయబారముల నితరదేశములతో జరుపుచుండెను. మంత్రిత్వమువెంబడి మంత్రిత్వములు కూలుచుండెను. గారిబాల్డీ రోమును జయింప నుత్సుకుఁడై వెనుకటివలె రాజుద్వారా మోక్షము రావలె ననుయాశను వీడి రిపబ్లికుపక్షము నంగీకరించెను. పోపురాష్ట్రములోనికి జొరబడి రాజుసహాయమున్నను లేకున్నను రోమును స్వాధీనపరచుకొనవలెనని యత డాతురపడుచుండెను. మేజినీ కీసారి రిపబ్లికు ముంజేతికంకణమయ్యెను. కాని గారిబాల్డీయొక్క మార్గమతనికి నచ్చలేదు. రోమనుప్రజ లందరు నొక్కసారి లేచి రిపబ్లికును బ్రకటించినచో నిటలీయంతయు రిపబ్లికుఘోషతోఁ బ్రతిధ్వనించునని యత డాశించెను. ఐనను నైక్యత యవసరమైనపుడెల్ల నతఁడు రాజీపడుచు గారిబాల్డీకి సహాయము చేయుచుండెడివాడు. ఈసారికూడ నత డంతఃకలహముల నొల్లక

గారిబాల్డీ రోముకు బయనమైనపు డతనికి సహాయము బంపక తాను చాల నస్వస్థుడై యుండకపోయినచో నతడే రోముకు వెళ్ళియుండెడివాడు. కాని గారిబాల్డీ యెప్పటివలె తన దుర్బలత్వమును బ్రదర్శించెను.

ఫ్రాన్సు గొప్పసైన్యముతో రోముకు వచ్చుచున్న సంగతి మేజినీకి దెలిసెను. గారిబాల్డీని ముందుకు పోవలదని మేజినీ యెంతబ్రతిమాలినను మానడాయెను. చివరకు గారిబాల్డీ పరాజయమొందెను. రాజుయెప్పటివలె పిరికితనమును జూపి ఫ్రాన్సుకు భయపడి తనమంత్రిని వెనుకకు పిలిపించెను. ప్రజలు కోపోద్దీపితులై రాజుచర్యను గర్హించిరి. రిపబ్లికనుపత్రికలు విజృంభింప నారంభించెను. పత్రికలు రాజును బహిరంగముగా నెదుర్కొనెను. కొంతమంది డిప్యూటీలు (రాజుయుద్యోగస్తులు) రిపబ్లికుయుద్యమమునకు రహస్యముగా సహాయముచేయుచుండిరి. మేజినీతో నిరంతరము నుత్తర ప్రత్యుత్తరములను జరుపుచున్న మిత్రసంఘము లన్నియు నీయుద్యమములో పాల్గొనెను. ప్రాతవలంటీర్లు ఫ్రీమేసనులు, చివరకు సైన్యము కూడ నీవిప్లవోద్యమముతో బ్రతిధ్వనింపసాగెను. మేజినీ యుద్రేకము నాపుకొనజాలక రోముకు బయవెత్తెను. రోమనుప్రజలు తిరుగబడలేరనియు, వాలంటీరుదళముకూడ చాలదనియు, ఫ్రాన్సు రోమును కాపాడుచున్నదనియు, ప్రభుత్వమును, ప్రభుత్వసేనను, నౌకాదళ



మును, మందుగుండు సామగ్రిని పట్టుకొనినగాని ఫ్రాన్సుతో పోరాడుట యసాధ్యమనియు మేజినీ గ్రహించెను. ముఖ్యముగా నతనికి పారిశ్రామికుల పట్లను, యువకులపట్లను, స్త్రీలపట్లను నెక్కుడు విశ్వాస ముండెడిది. జాతిలోనున్న తక్కినవారినందరిని పిరికితనము, బానిసతత్వము, ఆత్మవిశ్వాసము లేని సమయానుకూలప్రవర్తనము మొదలగు బానిసదేశలక్షణములు నిర్వీర్యులను చేసెను అతడు లుగానోనుండి జినీవాకును జినీవానుండి లుగానోకును దరచుబోవుచు రహస్యప్రయత్నములను గావించుచుండుటేగాక నీరోజులలోనే మహాద్భుతమతగ్రంథమును వ్రాసెను. ఈకాలమున జినీవాలోనున్నవారందరు నతని యనుచరులైరి. అతడు రహస్యముగా జినీవాకు వచ్చినపుడెల్ల పారిశ్రామికులు చాలమంది రహస్యముగా నాయుధపాణులగుచు పోలీసువా రతని పట్టుకొనకుండ వీధులలో గాపలాకాయుచు బసకు గొంపోవుచుండెడివారు. వారు చేయుసభలోని ప్రతికమిటీసభ్యుడును రివాల్వరులతో సిద్ధముగానుండెడివాడు. వా రత్యాతురతతో మేజినీకొరకు వేచియుందురు. "తలుపు మెల్లగా తట్టబడును. వెంటనే యొకమనిషి పరువెత్తుకొనుచువచ్చి తలుపుతీయును. మేమప్పుడు భయాశ్చర్య, విచారమగ్నమానసులమై మాముందు నిలిచియుండు మాహృదయనవనీతచోరుని, యమానుషవిగ్రహమును, మంత్రిగానిని కలుసుకొనుటకు వినయవిధేయతల.

తో ముందుకు బోవుము. మాహృదయము లావంబాబ్ధినోలలాడుచుండును. అతడు ప్రసన్నవదనముతో పసిపిల్లవాని హృదయమువంటి హృదయనైర్మల్యముతో, దివ్యమందస్మితకాంతులతో కరస్పర్శము చేయుచు మాకు స్వాగత మొసగుచుండును. మా లలాటములమీద మాపేరు లిఖింపబడియున్నవో యనునట్లు మమ్మందర నతడు పేరుపేరునను బిలుచును. అప్పుడతడు ప్రచ్ఛన్నముగా నుండడు; గుడ్డతో తయారుచేయబడిన కాలిజోడు; పొడుగైన యంగరకా; వంగని నిడివియైన శరీరము; ప్రపంచములో నేపోలీసువానిని కలలోగూడ నావంతయు శ్రమింపచేయజాలనని యప్పుడే తన యధ్యయనాగారమునుండి వచ్చుచున్న వేదాంతివలె నతడు గాన్పించును" అని యాకమిటీవారిలో నొకడు వర్ణించెను. మిలనులో నొక ప్రయత్నమప్పుడే భగ్నమైనను 1869 లో నతడు మరల నొక యుద్యమమును పన్నుచుండెను. స్విడ్జరులండులోనుండి యతడు మరల వెడలగొట్టబడెను. కాని యతడాగష్టునెలలో మరల స్విడ్జరులండువచ్చెను; ఆతని బాధ; వ్యాధి, దుర్బలత్వము నానాటికి హెచ్చిపోవుచుండెను. "నాయీనూతనప్రయత్నము గూడ వెనుకటి యన్నింటివలెనే యొకకలగాపరిణమింపవచ్చును." అని యతడొకస్నేహితునికి వ్రాసెను. అతడు ప్రష్యనుమంత్రియైన బిస్మార్కుతో రహస్యరాయబారములను జరిపెను. ఫ్రాన్సును భగ్నముచేయుటకు బిస్మార్కు ధనమును



సైన్యమును పంపించెదనని యంగీకరించెను. కాని చివరకది కూడ నిర్గంధకుసుమమయ్యెను. మేజినీతో నెప్పుడు నొకద్రోహి తిరుగుచుండెడివాడు. ఆద్రోహి యొకవంక మేజినీకి సమస్తోపచారములను జేయుచు ప్రభుత్వమునకతనిగుట్టునంతను దెలియచేయుచుండెడివాడు. మేజినీ పాలెర్మో జేరుటతోడనే మరల నరెస్టుకాబడి గేటీయనుచోటకు గొంపోబడెను. అతని కన్నిసదుపాయములును గావింపబడెను. ఎక్కడచప్పుడగునో, అతనికేమికష్టముతోచునో యనుభయముచే జయిలు అధికారి నెమ్మదిగా నిశ్శబ్దముగా తాళముతీయుటకు మూడు నిమిషములు తీసికొనెనట!

ఈజయిలులో నతడు కోటతలుపులవలె నున్న యభేద్యమగు ద్వారములకున్న రంధ్రములద్వారా శశిసూర్యులను నాకాశ, తారామండలములను జూచుచుండ గలిగెనట! సముద్రఘోషను వినుచుండెనట! అతడు వానినే తల్లిదండ్రులవలెను, సోదరులవలెను భావించుచు, వానితో సంభాషించుచు నానందమును బొందుచుండెడివాడు. "నాకవకాశమేయున్న మొదల నేనా బాల్యము నాశించుచున్నట్టి చారిత్రికగ్రంథమును (అదినాధర్మముగా భావించుచు) వ్రాసికొనుచు నప్పుడప్పుడొక్కకతూరి యేయనాథస్త్రీకో సహాయముచేయుచు, నేపారిశ్రామికునికో సలహాచెప్పుచు సంపూర్ణనిర్జనప్రదేశమందే నివసింపగోరెదను." అని యతడు వచించెను. ఆజయిలులో

నతడనేకగ్రంథములనుపఠించెను. తరువాతకొద్దివారములలో
నతనిని విడిచిపెట్టిరి. కాని యతడు స్వేచ్ఛగాతిరుగుట కంగీ
కరింపలేదు. ఈసమయములో ప్రజ లతనికిచ్చుసన్మానము
లకును చేయు యుత్సవములకును మేరలేకయుండెను. అత
డు వానినెంతమాత్రము నొల్లక నిరాడంబరముగా, ప్రశాంత
ముగా స్నేహితులమధ్య జీవింప నిచ్చగించెను.

అతనిని విడిచిననాటిరాత్రి రోములో నతనికి శాంతి
లేకయుండెను. ప్రజలు సన్మానములను కురిపించుచున్నారని
యతడు రహస్యముగా రోము, లెగ్హారను, జెనీవాలను విడిచి
పరుగిడనారంభించెను. ఈరహస్యప్రయాణములలో నొకరంగ
మతని హృదయఫలకమున చిత్రింపబడెను. "అది యొక క్రై
స్తవదేవాలయావరణము. ఆసమయమున చిమ్మచీకటులు క్రి
మ్ముచుండెను; అచ్చోటు విజనమై నిశ్శబ్దముగానుండెను. ఒ
కకాపరి నన్ను చూచెను. అతడు నన్ను ఆనవాలుపట్టెను.
కొద్దిమంది బీదలును వారిలో నొకమతబోధకుడును గుమ్మము
దాటివచ్చి యందరు నొకశ్రేణిలో వరుసగానిలబడి నన్ను
చూచి భక్తిపురస్సరముగా సాష్టాంగనమస్సులనర్పించిరి. ఒక్క
నిపెదవిమీదను చిరునగవైనను మొలకెత్తలేదు; స్తోత్రపా
ఠములను చేయుట కెంతమాత్రమును వారు ప్రయత్నించ
లేదు; నావిచారమును వారు గ్రహించి దానికి తామును భా
గస్వాములైనట్లు వా రిట్లు నిరాడంబరముగా ప్రకటముగావిం



చిరి." అని యతడు వ్రాసెను. ప్రజాసన్మానములును, స్తో
త్రములును, యుత్సవములును నతనికి తృణప్రాయములు;
"న న్నాకాశమున కెత్తివేయుచుందురు! కాని నే నెంతవా
డను." అని యతడనును. "నేను యిటలీయొక్క నిజశక్తిని,
ఆత్మను ప్రతిష్ఠింప నుత్సహించుచుంటిని. కాని నేను దాని
శవమునుమాత్రమే గాంచగలిగితిని." అతనియాత్మ చివర
వరకును యిటలీ! యిటలీ! నాయిటలీ! నేనెప్పుడును కలలను
గాంచుచుండు ప్రాచీనయిటలీ! యథార్థయిటలీ! యుత్కృష్టయి
టలీ! స్వధర్మమును గుర్తించినయిటలీ!" అని పరితపించుచుం
డెను. "పదివత్సరము లేకగ్రీవముగా నుపదేశపరంపరలను
కురిపించుచు ప్రొద్దుబుచ్చుటకంటె నొక్కమాసము దేశమును
కార్యరంగమున ముంచివేయుటచేతనే ప్రజలు సంస్కరింప
బడగలరు" అని యతడనేకసార్లు చాటెను. ప్రజలలో తగి
నంత రాజకీయనైతికప్రబోధములను నిరంతరము కలుగజేయు
ట యత్యావసరమనికూడ నతడు బోధించుచుండెను. "ఉత్స
వములకు, నూరేగింపులకు నిది సమయముకాదు. ఆత్మజ్ఞాన
మును, సంస్కారమును బడయుటకే యిది యదను" అని యత
డు యిటాలియనుయువకులకును, కర్షకులకును, ప్రజాసా
మాన్యమంతకును చాటెను. అతనిప్రబోధమువలన మిత్ర
సంఘములు, కర్షకులకు రాత్రిపాఠశాలలు, ప్రజాప్రబోధ
మునొనర్చు సంచారపుస్తకభాండాగారములు, కరపత్రములు,

పత్రికలు, యుత్పత్తి నభివృద్ధిచేయు పరపతిసంఘములు మొదలగునవి దేశమంతటను వెదజల్లబడెను.

మహాత్ము లెప్పుడును నూతనభావప్రచారమునకే జన్మ మెత్తుచుందురు. మేజినీజీవితమంతయు నీసామెతనే సార్థకము చేయుచున్నది. మానవుడు తిండికొరకే పుట్టుటలేదు. తిండివలననే జీవించుటలేదు. ధర్మనిర్వాహణమే మానవపర మావధియని మేజినీజీవితము ప్రపంచమునకు చాటెను.

కాని త్వరలో నాకట్టడివిధి యీదివ్యతేజస్సును, యీస్వార్థత్యాగిని, యీబ్రహ్మచారిని, యీదేశభక్తుని, యీదైవభక్తుని, యీజగత్కల్యాణమూర్తిని జగన్నాటకరంగమునుండి తిరోహితునిజేయ సంకల్పించెను. మేజినీ కరువదియేడు వత్సరములు నిండెను. శరీరపటిమ తరిగెను. "ఈ నాజీవితయంత్రము ముప్పదియైదేండ్లనుండియు నవిచ్ఛిన్నముగా వ్రాసి, వ్రాసి, వ్రాసి చివరకు జరాభారముచే కృంగిపోవుచున్నది" అని యితడు స్నేహితులకు వ్రాయుచుండెడివాడు.

ఇట్లున్నను, స్వేచ్ఛగా దిరుగుటకు ప్రభుత్వమువా రంగీకరించినను గూడ నతడు దానిని నిరాకరించి ప్రచ్ఛన్నముగనే నామాంతరముతో పైసా, జినీవా, ప్లోరెన్సు మొదలగు స్థానములకు బోవుచు నిటలీస్వాతంత్ర్యముకొరకు పోరాడిన వీరులసమాధిస్థలములకు తీర్థయాత్రలు సలుపుచు బుష్ప



మాలికలతో వాని నలంకరించుచు స్వాతంత్ర్యకలలలో దన్మయత్వము నొందుచుండెడివాడు.

అతనిమిత్రులును, బంధుగులందరును నశించిరి. మిగిలియున్నసోదరియొక్కతెయు నతనిని జూడ నిరాకరించెను. భార్యాపుత్రులు, స్వగృహము యనునవతని కంతకుమునుపే లేవు. అతడు ప్రేమించినస్త్రీకూడ చనిపోయెను. గారిబాల్డీ మొదటివలె విముఖుడుగానే యుండెను. తనకాలముకూడ సమీపించుచున్నదని యతడు గ్రహించెను. ఈసమయమున వ్యాధిపీడితుడైయున్నయతనిని బెర్టనీయను స్నేహితుడొక్కడుమాత్రమే కంటికి రెప్పవలె గాచుచుండెను. "నేను ప్రేమించినవారందరు నొక్కరొకరే యకాలకాలధర్మము నొందుచుండ మృత్యువు నన్నేల దిగమింగకుండనున్నదో నాకు తెలియకున్నది. నే నిక నీలోకములో నెన్నివత్సరములు, యెన్నినెలలు, యెన్నిదినములు బంధింపబడియున్నను లాభమేమికలదు? నే నింకొకలోకములో బనిచేయుటకు బోవుచున్నంతమాత్రమున మిమ్ము తక్కువగా బ్రేమింపజాలను. ఇక నే నెక్కడవున్ననేమి? మీరు కార్యశూరులగుటయే నన్ను ప్రేమించుటయగును. నాకు కావలసిన దదియేగాని వేరొండుగాదు. నేను గతించినతరువాతనే నాజీవితము వృథగాకుండ నుండుటకు మీరెక్కువ శ్రద్ధాభక్తులతోను, పట్టుదలతోను పనిచేయుదురని నే నెప్పుడును దలచుచుందును."

అని యతఁ డవసానకాలమున దనస్నేహితులకు వ్రాసి చిరకాలమునుండి మిగిలియున్న యొకప్రాణబిందమును దీర్చివేసి వ్యాధిగ్రస్తుడై యనునిమిదివందలడెబ్బదిరెండవసంవత్సరమున మార్చి పదియవ తేదీని, యరువదియేడవయేట "భగవంతునియట్ల విశ్వాసమా! అవును. నేను భగవంతునెప్పుడును విశ్వసించుచునే యున్నాను. నావిశ్వాస మచంచలము." అను నమృతవాక్కులతో నీభౌతికశరీరమును వీడి తన యవతారమును చాలించి వీరలోకము నలంకరించెను.

సమాప్తము .



—♦ శాశ్వతపోషకులు ♦—

1 దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు, చెన్నపట్నం.

2. పడింపల్లి సుబ్బరాజుగారు కోడూరువాడు.

3. జాజాల చలమయ్యశాస్త్రిగారు రాజమండ్రి.

4. దేవులపల్లి సోమయ్యగారు, ఆకిరిపల్లి.

—: రాజపోషకులు :—

5. శ్రీరాజా వెంకటాద్రి అప్పారావు బహద్దరు జమీందారువారు, నూజివీడు.

6. కామర్సు బాలకోటేశ్వరరావుగారు దువ్వ.

6. వల్ల సూర్యనారాయణగారు వకీలు, కొవ్వూరు.

8. డామోజీపురపు సత్యాధిరావుగారు వకీలు, కొవ్వూరు.

9. బలిజేపల్లి సుబ్రహ్మణ్యంగారు, వకీలు, తణుకు.

10. కలిదిండి గంగరాజుగారు, తాడేపల్లిగూడెం.

11. మదిపల్లి అమ్మిరాజుగారు, ఆరవల్లి.

## —। ప్రధానపోషకులు ।—

12. డాక్టరు జీడిగుంట కామరాజగారు, నిడదవోలు.

13. డాక్టరు నత్తిరాజు వెంకట్రావుగారు, అత్తిలి.

14. శివుడు శివరావుగారు, కొవ్వూరు.

15. చేడ నారాయణమూర్తిగారు, తొండంగి.

16. ముళ్లపూడి తిమ్మరాజుగారు, జమీందారు తణుకు.

17. తల్లాప్రగడ కామేశ్వరరావుగారు, ఉంగుటూరు.

18. తల్లాప్రగడ భీమేశ్వరరావుగారు, ”

19. పులవర్తి లక్ష్మణస్వామిగారు. ఆకివీడు.

20. వసల సోమయ్యగారు, తాడేపల్లిగూడెం.

21. దేవులపల్లి రామమూర్తిశాస్త్రిగారు, తిమ్మరాజుపాలెం.

22. వెలగల శ్రీరామరెడ్డిగారు, ఆరవల్లి.

23. నెక్కంటి సత్యనారాయణప్రతాపరావుగారు, బాదంపూడి.

24. చావలి రామసోమయాజులుగారు, కాకినాడ.

25. పెన్మెత్స సత్యనారాణరాజుగారు, రేలంగి.

26. బొడ్డుపల్లి లక్ష్మీనారాయణగారు, కొవ్వూరు

27. కఠారి అచ్యుతరామరాజుగారు, ఒడ్డూరు.

28. బోళ్ళ వెంకటరత్నముగారు, పెదపట్నమగ్రహారం.



29. తుమ్మలపల్లి వెంకటరత్నముగారు, పిప్పర.

30. తుమ్మలపల్లి లక్ష్మీనారాయణగారు ,,

31. ఇందుకూరి సుబ్బరాజుగారు ,,

32. మాజేటి రామచంద్రరావుగారు, ఏలూరు.

33. జోస్యుల రామచంద్రరావుగారు, రామచంద్రపురం.

34. వ్యాసతి సుబ్బారావుపంతులుగారు, రాజమండ్రి.

35. పోలిన రాజు అనే రామచంద్రుడుగారు, ములకల్లంక.

36. గాడేపల్లి హనుమానులుగారు, అత్తిలి.

37 బొమ్మకంటి రామమూర్తిశర్మగారు, నిడదవోలు.

38. ఆకుమిల్లి వెంకటసుబ్బారాయుడుగారు, నాగుల్లంక.

39. రావుసాహేబు కల్లి చిట్టి అబ్బాయినాయుడుగారు, పుల్ల.

40 పెన్మెత్స రాఘవరాజుగారు, గోటేరు.

41. అరవ తిరుపతిరాయుడుగారు, రాజమండ్రి.

42. తేతలి సీతారామయ్యగారు, తేతలి.

43. రెబ్బాప్రగడ మందేశ్వరశర్మగారు, కొవ్వూరు.

44. పెండ్యాల రామలింగంగారు, తాడేపల్లిగూడెం.

45. తుంగా పురుషోత్తంగారు, పలివెల.

46 ఇందుకూరి లక్ష్మీపతిరాజుగారు, దువ్వ.

# పల్లెటూరి గ్రంథమండలి,

## రాజమండ్రి.

---

| | |
|---|---|
| 1 గాంధినీతిమఞ్జరి | 0- 3-0 |
| 2 రాజనీతిసారము | 0- 3-0 |
| 3 ప్రాచీన భారతగ్రామపరిపాలన | 0- 2-0 |
| 4 కర్మయోగి ఆదర్శము | 0- 3-0 |
| 5 భారతస్వరాజ్యయుద్ధము | 0- 6-0 |
| 6 ఆర్యుల ఆదర్శము | 0- 6-0 |
| 7 వినాయకసావర్కారు | 0-10-0 |
| 8 మహారాణి ఝాన్సీలక్ష్మీభాయి | 0-10-0 |
| 9 మేజినీజీవితము | 0-10-0 |
| 10 రామతీర్థ | 1- 6-0 |

చందాదారులు కాగోరువారు 0-4-0 ప్రవేశరుసుము చెల్లించవలెను. సంవత్సరచందా 2-0-0 మాత్రమే.

---

